# KATHAGUTCHAMU

# కథాగుచ్ఛము



*Authors :*

**D. MOSES, M.A.,**

gu Lecturer, A. C. College, Guntu

&

**Kavisekhara, G. JOSEPH**

14496



PUBLISHEL

FOR THE AJANTHA BOOK HOUSE, SECUNDERABAD,

BY

**THE ORIENT PUBLISHING Co., (Regd.)**

MADRAS :: TENALI

 1947 [*Rs. 1—0—0*

# కథా గుచ్ఛము

పోషకులు:
గార్లవడ్డు సంస్థానాధీశ్వరులు
శ్రీ శ్రీ శ్రీ కాళ్ళూరి వేంకట అప్పారావు దొరగారు
జమీందారు

గ్రంథకర్తలు
డి. మోజెసు, ఎం. ఏ.,
ఆంధ్రభాషోపన్యాసకులు, ఏ.సి కాలేజి, గుంటూరు
కవిశేఖర, జి. జోసఫు,
వసంతకుమారి, చంద్రహాస, కన్నీటికబురు, కవిచక్రవర్తి, సర్ కట్టమంచి,
బిచ్చగాడు, భక్తవిజయ, భారవ్యాద్యనేక గ్రంథకర్త



సికింద్రాబాదు అజంతా పుస్తక నిలయము వారి తరఫున
తెనాలి, ది ఓరియన్‌ట్ పబ్లిషింగ్ కంపెనీ (రిజిష్టర్డు)
ప్రచురించినది

 1947 [వెల రు. 1-0-0



కాగితము సంపాదించుకొనుట కేమి, పుస్తక ప్రచురణ
కేమి, ప్రతిబంధకములు గల ఈ కాలమున
అడిగినదే తడవుగా రెండును మా కొదవ
గూర్చిన ఓరియంట్ పబ్లిషింగ్
కంపెనీ వారికి గ్రంథ
కర్తలెంతయు
కృతజ్ఞులు



ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి
కోటా కార్డు నెం. జి 1. ఎ., కాపీలు 500—1-9-47



పో ష కు లు

శ్రీ కాళ్ళూరి వేంకట అప్పారావు దొరవారు

జమీందారు, గార్లపాడు

# ప్రస్తావన

శ్రీరాజిల్లఁ బూజ్యపావన యశశ్శ్రీసౌఖ్యభోగాంక భా
గ్యారోగ్య ప్రతిపాదకాది శుభ విన్యాసంపు సామ్రాజ్య సం
భార ప్రాభవమిచ్చి రక్షకుఁడు సంభావించి కార్యారియు
స్వారాయాగ్రణిఁ బ్రోచుగావుత మహాప్రావీణ్య మింపారఁగన్.

మాతృగర్భమునందె మనుజకోటి దురంత
కష్టాలతో జాలిఁ గలిపినాఁడు
కన్నీటి దాహంపు కరుణతో ఖగములఁ
బ్రేమించి ముంజేత పెంచినాఁడు
పరవి సహింపా ప్రసక్తి ప్రశంసతో
జగదేక పుణ్యంబుఁ జాకినాఁడు
ఒక చెంపఁ గొట్ట వేరొక చెంప నందించు
సమధర్మ తత్వంబుఁ జాటినాఁడు

దీనబంధువునై శాంతి దివ్యబోధ
గదలు స్వాతంత్ర్య రథము చక్రాలమీఁద
ఖండ ఖండాంతరంబుల ఖండ దీక్షఁ
ద్రిప్పి కీర్తిధ్వజంబు సాధించినాడు.

సరవిం దా నొనరించు విస్తులిత భాషాసేవమందార పు
ష్పరజోగంధము విచ్చలించు ప్రతిభా ప్రాగ్భార సౌభాగ్యప్రన్
మురువుంగీర్తి యొకింత తగ్గదు, జగంబుల్ క్రుంగి కూలారియు
స్థిర రూపంబున తారుమారగుచు సత్తేజంబు వోనాడినన్

ఉపకృతియే గాని యపకార మేనాఁడు
పరుల కొనర్పని పరమగురుఁడు
దయచేయుటయె గాని భయపెట్టి యేనాఁడు
పరుల నిందింపని భద్రమూర్తి
ఆమతించుటె గాని యప్రియంబులు పల్కి
యర్థులఁ గసరని యసమదాత

సరసవాక్కులెగాని పరుషోక్తు లెన్నడు
పలుకఁగా నోచని తెలుఁగు బిడ్డ

పరుల మేలున కామోద పడెడివాడు
అధికమగు ప్రజాగణమున నలరువాడు
పండితాదరణంబునఁ బ్రబలువాడు
అమలగుణసాంద్రుఁ డప్పరాయాగ్రవిభుఁడు.

స్థిరముగ నన్నిదిక్కుల వసించెడి పావనకీర్తికాంత యి
ద్ధరణిని గల్గు దేశముల దాన గుణంబను నందలంబుపై
తిరముగ నూరుచుండి కవిధీరులు, యాచకపాళిబోయలై
పరువడిఁ దన్ను మోయఁగను యర్థిలు చుండెడు సంతసంబునన్

చనిన దినాల దాన గుణ సంపదఁ గీర్తిఁ గన్న పుత్రుల
న్గని యిరు దట్టివారలను గాంచగనైతి నటంచు వార్తిచేఁ
బనవెడు సాంధ్రమాత వెతఁబాప జనించి ప్రశస్తభావనా
ఘనుల స్రవించుచుండెను బుధుల్ తమపీవన కాన్కలంపగన్.

సన్మనస్కులయందు మానవుని కతన
ద్వారకాపుర మల జనార్దనుని వలన
కలిమిఁ దులదూఁగినట్లుగ గాన్లవడ్డు
వెలసె నప్పయభూపు వివేకమునను.

తెలుఁగుఁ గవిత్వపుం బసలు దీర్చిన తేనియతెట్టెలందు దో
బ్బిలు పరిపక్వభావ, నవవీధుల వజ్రవిమాన మెక్కి తా
తల జవరాండ్ర క్రొన్నగవు దర్పణ భాగ్యపు ముద్దులాటచే
సులికెడి తద్విభూతి పుఁకొల్ప కవీంద్రులు సంతసింపగన్

ఏదాత నిర్మించె నీశ్వరభక్తిచే
దేవాలయముల నల్దిక్కులందు
ఏదాత గావించె నెల్లదేశములందు
ప్రాకట కూప తటాకచయము
ఏదాత వాకిట నెవ్వేళఁ జూచిన

రేదాతి యింటిలో నెప్పుడు జూచిన
హరుని సంకీర్తన మలరుచుండు

అతడు బీదల పాలిటి యమరతరువు
అంత్యజాల పాలిదైవ మత్యంత వితర
ణ ప్రవీణుండు దార విన్యాస చరితుఁ
డాయతయశుండు శ్రీవేంకటప్ప విభుఁడు.

కొలువున గద్దె పైన గులుకుంజిగిముద్దుల తొల్కరించి న
వ్వుల బొలయించి, శాంతయుతవృం బరిపాలన మాచరించు
వలను దలంపగా మతికి వచ్చును తిమ్మరుసు ప్రధాని ని
స్తుల పరిపాలనంపు గుణశోభలలో గల ధర్మచంద్రికల్.

కన్నీటివగపాల మున్నీటి కెరటాల
జిలుఁగుటూరతులపొంగలి యొసర్చి
పౌరుష నిస్తంద్ర భావనా భీలంపు
మిసిమి కత్తురుతేన మీదు గట్టి
స్థిరతరత్యాగ నిస్సీమ తేజోధిక
పుష్పగంథంబులఁ బూజచేసి
మాతృదేశార్జన మంత్రాక్షతలవాఁడి
కత్తులబోను బీగముల దీసి

అంగలార్చుచుఁ దపముల నాచరించి
రాట్నమున దుఃఖగీతి సూత్రములదీయు
భారతాంబామణీ దాస్య బంధనముల
త్రుంచ ధీశాన్న భరతపుత్రుండు నిజము.

కను దామరలలోనగరుణాస్రవంతులు
నవ్వులలోఁ గమ్మపువ్వుఁదేనె
చూపుటీరంబుల సుప్రసన్నత్వంబు
వాక్కుల జిగురుభావాల సొంపు
మానసంబున దివ్య దీనచింతామణి
హృదయాన ధర్మజయేందిరయును

ఆకారవైభవమం దఖండయశమ్ము
దేవభాషాదుల వినయగరిమ
గలిగి త్యాగ ప్రసిద్ధ దుర్గాలపైనఁ
జనువు కెండాల హారతి పసదనంబుఁ
దనుఁగు తల్లికి వర్పించి తేజరిల్లు
తన మహాకీర్తి వర్ణింప ధాతవశమే?

స్థిర దీక్షారతి నూని నిస్తులిత పాతివ్రత్య సౌగంధ్యపుం
బరమ ప్రాభవ భోగ భాగ్యముల విస్ఫారంబు గుంఫించి సం
బరమున్ దీనుల జాలిపైఁ గరుణతో భావించి, భర్త్రాజ్ఞ ని
ర్భరమున్ బ్రోచెడి రంగనాయకి సతిన్ వర్ణింప సామాన్యమే.

లలితమై శ్రీరామలక్ష్మాంబ నిష్ఠతోఁ
గులవృద్ధుల ప్రతిష్ఠఁ గోరుచుండ
శీలవిభూతి లక్ష్మి సర్వమ సతంబు
సత్య చారిత్రంబు జాటుచుండ
ధర్మ తత్త్వంబున తాయమాంబాదేవి
భక్తి తాత్పర్య సంపదల జిమ్మ
విమల వివేకంబు విరఁజిమ్మ విమలాంబ
పరమ సౌశీల్యంబు గెలుపుచుండ

ప్రీతి శ్రీరామచంద్రుఁడు వేంకట వర
సింహరాయ పుత్ర వరులు సిరుల నింప
కీరితి కాటూరులందున గ్రీడసలిపి
యప్పరాట్పతి దిక్కుల నలరు గాత.

అక్షర లక్షలిచ్చి కవితావని పాలన చేయుచున్న తా
వక్షయమైన గీర్తిగనునట్టి కుమారుల గాంచి, దాస్యపున్
దీక్షను దగ్గి యా భరతదేశహితార్థము శౌర్యగానమున్
దక్షత పాడగా జయపతాకము లెత్తును గాత దిక్కులన్.

# యోసేపు

శ్రీయుతంబై సకలసంపదల కాకరంబై జగద్విఖ్యాతిఁ గాంచి విలసిల్లు నాసియాఖండాంతర్గత 'కనాను' అను దేశం బొకండు వాసిందనరారు.

నదీనదంబుల సంచారపూజితంబై పుష్కల సస్యప్రసన్నమై నిత్యకళ్యాణపూరితంబై తద్దేశంబు దిగ్దేశంబుల నోడించి మించు. అంగుళమంగుళ మతిపవిత్రంబై మనోహర ఫలపుష్పవృక్షవితానంబుల కాలవాలంబునై నానావిధపక్షి దంపతీ కూజితంబులచేఁ బూజితంబునై సతతవాసంతికానంద దాయకంబునై, కొఱఁతలేని పాఁడిపంటలచే దొంతులాడుచుఁ బాలుతేనెలఁ బ్రవహించుచు, కల్పకల్పవై, శత్రు భయంబులేని ధైర్యదుర్గంబుల విజయధ్వజంబుల నెత్తించుచు, బొంకులులేని బింకంబున విఱ్ఱవీఁగుచు, చింతావిహీన సంతోషపూరితవారాశి తరంగంపు టుయ్యాలల నుఱ్ఱూతలూగుచు సత్యశీలంబు, ఆర్తజన రక్షాదక్షసమర్థత పారమార్థిక చింతామహత్త్వంబు, న్యాయవిచక్షణాధురీణత గలిఁగి సకలసౌభాగ్యసంపత్సమేతమై నిత్యానందపరంపరలకు పుట్టినిల్లై భక్తజనంబుల ముదమార గారవించుచుఁ బున్నెంపుగడ్డయను బిరుదంబు నార్జించి దొసంగులులేని కీరితిపసల నాపాదించి సర్వసుఖోపలబ్ధియై కరంబు తజ్జనపదంబు భాసిల్లు.

అందు యాకోబను నొక భక్తాగ్రేసరుండు గలండు. సుగుణంబుల పేటియై పరోపకార పారాయణుండై దయాళుఁడై

కరుణాంతరంగుఁడై జ్ఞానసమోపేతాభాసితుండున్న కారణ జన్ముఁడై దీనబంధువునై సర్వత్ర సామరస్యభావ బంధంబులఁ గట్టువడి సకలసజ్జన సంసేవితుండునై మెలంగుచుండు.

పైకొను నితాంత విక్లాంతవాతావరణంబునకుఁ జలింపక, సదసద్వివేక సంపన్నుఁడై నిప్పచ్చరపుదేవి దుఃఖ సింహాసనంబును బూజించు నిర్భాగ్యుల దైన్యజాతకంబుల బరువుఁ బడిగట్టుచు, పదుండ్రకు తలలో నాలుకగ మెలంగుచు శ్లాఘనీయంబగు చరిత్రయందు బన్నిటిస్నానంబుఁ బచరించె.

ఈర్ష్యాసూయ లాతని గీముముంగిలిఁ జెంగలించి యెఱుంగవు. అదృష్టాదేవి వేడ్కఁ జూడ్కి కాతఁడసహ్యించుకొనును. కామక్రోధంబులు సాగించు దిమాకుల కాతఁ డిసుమంతయేని చలింపడు. భావి సచ్చరిత్రల కుపక్రమించు. సౌశీల్యలావణ్యము లాతని వయస్సంపదలను బొడిగింపఁదొడంగె. చక్రవాకంబునకు సూర్యోదయ మెట్టిదో, మనుష్యజీవితంబునకు ప్రాణ మట్టిదని సమస్తజీవుల సమభావంబున ప్రేమించుచుఁ బాలింపఁ దొడంగె. మంచికార్యంబు లొనర్చుటయే యాతనికి హితము. దానికై యాతడు కాలమును, కారణమును వెదకుచుండు. భగవదాజ్ఞకు భయపడుచు, ఆయన కారుణ్యమును, మహిమాప్రాగ్భారంబును గీర్తించుచుండు. అవివేకుల వివేకములో మెఱపించును. ధ్యానశక్తిని, వివేచనాశక్తిని తనపవిత్ర గుణగణంబులతోఁ బొంగించి, గాపాడు

కొనుచుండు. పొరుగువాని యానందాభివృద్ధిసౌఖ్యంబులఁ గాంచి, పరమానందభరితుండగును గాని వాని వినాశన మునకై కుతంత్రంబుల నొనర్పడు, కన్నీరుగురియఁడు. క్రూర స్వభావమును వెలిఁబుచ్చఁడు. సామరస్యంపుఁ బన్నీటి జల్లు లతో నభిషిక్తునిగావించి దీవించు. గులాబిపూవు స్వాభావిక ముగ సుగంధయుక్తమై తనరారు నట్లాతని హృదయ మహర్నిశంబులు సత్కార్యకలాపంబుల గావింప వేగిరపడు చుండు. న్యాయవర్తన, నిష్పక్షపాతబుద్ధి, యణకువయను నడవడి కాతని సహజగుణంబులు జ్ఞానముతోను, న్యాయము తోను, శాసనంబుల సృష్టించుచుండు. గొప్పగొప్ప విష యంబుల నాతడు తలపోయుచుండు. లోకోపకారకము లయిన కార్యసమూహంబుల బొనర్ప నుంకించు. క్రొత్త క్రొత్త యెత్తుల నెత్తుచుండు. వినమ్రతయు, విధేయతయు, వానికి పెట్టనిసొమ్ములు. ప్రేమగంధంబు గుంఫించి సంతోష ముతో మరియాదఁ జూపును. పరులకు తనవలన గలుఁగు మేలు కార్యంబు లాతనికి పరువు మరియాదలఁ గూర్పఁగలిఁ గిన ప్రాభవంబులని మురియుచుండు. సౌశీల్యము సంపాదిం చుటయం దాతనికి చాతుర్యము మెండు. జ్ఞానభాగ్యము దైవాధీనమనియు, దాని నెవ రెంతెంతఁ బొందఁ దగుదురో, వారివారి కంతంత భగవంతుఁడు ప్రసాదించునని యఖండ తపస్సుఁ దత్ప్రాప్తికై గావించు.

సత్యము, శౌచము, శమము, దమము, దయ, వైరాగ్యము, త్యాగము మున్నగు సద్గుణంబులఁ బ్రేమించి పోషించు

చుండునుగాని, అతఁడహంకార కామక్రోధలోభమోహ మద మాత్సర్యంబులఁ జేరనీయఁడు. దుశ్చింతలను దుర్భావములను దుర్గుణంబులను దుష్కార్యంబులను వర్జింపఁగల విధ్యుక్త ధర్మంబుల నభ్యసించు. సంసార ప్రవృత్తియందు, భిన్నావస్థల యం దనుష్ఠానయోగ్యములైన నీతుల నభ్యసించు. జీవయాత్రయందు మానవజీవిత ధర్మంబున కెట్టివి యవసరమో యట్టివి దేహేంద్రియ మనోధర్మ క్రియారతిని నిర్వర్తింప యత్నించు. భక్తివిశ్వాసంబులఁ బ్రేమించు. కడగండ్లఁ గరుణాగీతముల బాడు. అనడలఁ గన్నీటఁ గనికరించు. సదాచార విధులఁ బాటించు. స్వతంత్ర జీవితారాధన కుపక్రమించు. హింసాకృత్యంబులకు జిత్తంబునుబోడిగింపడు. ధీరోదాత్తుఁడై ప్రతిభా ప్రభావంబుల నుదయింపఁజేయు. అతీతయోజనా విహాయసంబున సద్భావనా విమానంబుల నెక్కి నిర్భరానందంబున విహరించు. దిక్కుమాలిన దీనులకుఁ బురోభివృద్ధ్యభిప్రాయంబులగు కార్యజాలంబుల నుద్బోధించుచుండు. పరోపకారార్థమై దైవసేవా తత్పరతకై జీవితశేషంబును వినియోగించుచు దేశకాల పరిస్థితుల జాగ్రద్రీతిననుసరించు.

పెద్దభార్య 'లేయ' చిన్నభార్య 'రాహేలు' ఇరువురు నిజనాథు నానతి జవదాటి యెఱుంగని సాధ్వీలలామలు అణకువయు నానందభావ మకరందరస స్రవంతు లహర్నిశంబు గురియింతురు; వివేకదూరంబులగు కార్య సమూహంబుల నొనర్పరు; అల్పకాలంబున నస్తమించు తుచ్ఛభోగేచ్ఛలం

దాస వహింపరు; దైవ దత్తములగు మహాశక్తి పుంజంబుల నెన్నడేని వృథఁబుచ్చక జంకక నొచ్చక తమతమ ప్రాతివ్రత్య ధర్మనిరూఢిని వెలిఁబుచ్చుచుందురు.

కష్టములకు సుఖములకు దుఃఖములకు సుంతేని తమకరుం విధివిధానంబులం గూర్చి వెగటుఁజెందక హృదయాలోచనల నిలువరించుకొందురు.

మార్కొను దుఃఖ తరంగంబుల గప్పిపుచ్చి సంతోషమును జ్ఞానమును నిబ్బరమును మనస్తృప్తియును వెదఁజల్లుచుందురు. శాశ్వతానంద సౌధంబున సౌశీల్యవజ్రంబుల సలీసువెలకు విక్రయింతురు. పెదవులందు దయానురాగంబులు దైవాఱుచుండు. చెక్కిళ్ళయందు లేఁత గులాబిపూల వన్నెలసొంపు పెంపారు. పగలెల్లఁ బరితోషముతో శ్రమించెదరు. గృహాధిపత్యంబునందు కుశాగ్రబుద్ధిబలంబులఁ గుసుమింతురు. కనులయందు స్వేచ్ఛ, సంభ్రమము రేకెత్తుచుండు. అవమాన కోప లాంఛన రోగ భ్రమ లోభ విచార పశ్చాత్తాపములు వారిని వెంబడించవు. వివేక యోజనాబోధల నాలకింతురు, సూనృతపు టుపదేశంబులు వారి హృదయ కవాటంబుల పరిమళించు. పన్నీటి పూవువంటి సచ్చారిత్రమున కపయశంబు వాటిల్లనీయరు. హస్తాబ్జంబులు సత్కార్య కలాపంబుల యాచించు. పనిలేని పర్యటన వారిచ్చగింపరు. కలిఁగినదానితోఁ బరమానందభరితు లగుదురు. అపహాసంబునకునైన వల్లెత్తి పరుల దూషింపరు. అణకువ, నమ్రత,

నెమ్మది వారికిఁ బెట్టని భూషణంబులు. పెదవులపైఁ గమ్మపలుకుల తేనెతీవ జొబ్బిల్లుచుండు. మాటలయందు, సంభాషణలయందు చల్లఁదనము సత్యౌచిత్యము లోలలాడుచుండు.

ఆజ్ఞానువర్తనము వారి జీవితమందు గాంచిన సదుపదేశంబు, శాంతిసత్యంబులు వారు బడసిన బహుమానంబులు. వారి యడుగులముందు వివేక తేజంబులు దాగుడు మూత లాడును. సౌశీల్యదేవత వారి ముంజేత నాట్యమాడుచుండు. కనులు పెద్దరికమును తెలియజేయును. దుష్ప్రవర్తనగలవారిని ఖండింతురు. హృదయకోశంబు వారి సౌమ్యతకు సదనంబు. పొరుగువారి తప్పిదంబుల బాటింపరు. విపత్కాల విధివికారంబులకు విహ్వలురుగారు. శాంతితో వాటిని సహింతురు. సద్బోధనలచే భర్తృ కష్టపరంపరల నుపశమింపఁజేయుచు ప్రేమోపచారంబులచే నూరటం గూర్తురు. సుగుణకలాపంబులచే దినదిన ప్రవర్ధమానులగుచు భాసిల్లు నయ్యువతీలలామలఁ జేపట్టిన యాకోబు భక్తాగ్రేసరుని యదృష్ట మెంతేని బొగడఁ జెల్లు. స్వాభావిక దాంపత్య సౌఖ్యజీవిత భాగ్యంబున పెద్దభార్యయగు లేయయందాతఁడు పదిమంది కుమారులను గాంచెను. అందు జ్యేష్ఠపుత్రుండు రూబేను. ద్వితీయపుత్రుండు యూదా. ఇరువురు సౌజన్య విలాస మూర్తులునై, పెంపగుచుండిరి; చిన్న భార్యయగు రాహేలునందు యోసేపు, బెన్యామీనులను నిరువుర కుమారులను దీనయను నొక కుమార్తెను గాంచెను. ఒంటియున్నవ్రవాహంబుల కష్టంబుల, నాకలిదప్పుల

నోర్చుకొని యిసుక యెడారులయం దెల్లు బరువుమోసికొని దరిజేర్చునో, యట్లే యాకోబు సంసారభార వారాశి తరంగంబుల నుత్తరించుచు దైవప్రసాదంబని అల్లారుముద్దుగా నిజ పుత్రీపుత్రికుల బెంచుకొన దొడంగెను.

జ్ఞానము, అణకువ, దైవసేవాతత్పరత, కులవృద్ధుల గారవించు నిష్ఠాత, సజ్జనసాంగత్యము, మైత్రి, ప్రశాంత దృష్టి, దేశభాషారాధన, పరోపకారపారీణతాది సదాచార తత్త్వంబుల నుగ్గుపాలతో నూరి యణువణువున చరించి ఈర్ష్యాసూయ భావంబుల వృద్ధిపొందనీయక ప్రేమానుబంధంబుల బొడిగింప నతడు గుమారులం బెంచుచుండె.

అందు యోసేపనువాడ డధిక రూపరేఖాలావణ్య సౌభాగ్యంబులగలిగి రాజచిహ్నంబులు గలవాడు. తనయులందరికంటె జనకుని కధిక ప్రేమ వాత్సల్యభావంబులు యోసేపునందు నాటుకొని ద్విగుణీకృతం బగుచుండె. ప్రేమకు ప్రతిఫలంబుగా యోసేపున కొక నానావిధ వర్ణచిత్రంపు నిలువుటంగిని కుట్టించెను. నాటినుండి సహోదర శ్రేణి కమిత క్రోధభావంబులు యోసేపుపై పుంజీభవించి పొంగిపొర్లి తాండవింపదొడంగె. 'సోదరుల ఈర్ష్యాసూయభావంబుల గ్రహింపనేరని యోసేపు వారికడ నన్యోన్య మైత్రీభావంబుతో బ్రవర్తించుచుండె. వృద్ధాప్యమందుద్భవించినముద్దుల కుమారుండగు యోసేపు నొక నిమేషమేని విడనాడి యెరుంగని జనకునియవ్యాజ భక్తి, ప్రేమభావంబు

లకు మేరలేలేవు. యోసేపుపై బ్రసరించు జనకుని ప్రేమ జ్యోతులు సహోదరుల హృదయ సౌధంబుల బ్రజ్వలించు జీవన్మహాగ్ని జ్వాలలై దిశాంతరంబుల నల్లిబిల్లిగా గ్రమ్ముకొనియె. గోటిపై రోకటిపోటన్న ట్లీర్ష్యాసూయ భావంబులకు దోడు, కొండొకనాటి రాత్రియందు యోసేపు అన్నదమ్ములతో, తమ చేనియందు పనలుకట్టుచుండ తన పన లేచినిలుచుండగ నన్నల పనలు తన పన చుట్టుకొని సాష్టాంగ నమస్కారంబు లాచరించునటుల స్వప్నంబుఁగని తద్విషయ మామూలాగ్రముగ నిష్కపటభావంబున నను జులతో విశదీకరించె. తోకత్రొక్కిన కోడెత్రాచుభంగి సహోదరు లాగ్రహావిహ్వల చిత్తంబులతో నీవు నిశ్చయముగా మమ్మేలు నధికారివగుదువా! నీకండరంబుల జెండి గగనపక్షుల కాహారంబు గావించెదము. నీగర్వము, నీ గారాబుతనము, నీ ఠీవి, నీవికారచేష్టలు నీజనకునిప్రాపుఁ జెల్లునుగాని మాప్రాపుల మాత్రము సాగనేరవు. నీభావి జీవిత శేషంబును, నీదిమాకులను, నీపటాటోపంబుల నిఁక జాగ్రదీతి గాపాడుకొనుచు మెలంగవలయునుమీ! అని మందలించి భయపెట్టి, కనులెఱ్ఱఁజేసి వ్రేలితో బెదరించి చికాకుగావించిరి.

మఱొకనాటిరాత్రమందు సూర్య చంద్రులును పదునొకండు నక్షత్రంబులును సాష్టాంగనమస్కృతు లాచరించినటుల కలఁగని పూర్వస్వప్నకాలంబునాఁడు గలిఁగిం

చిన ప్రాయశ్చిత్త ప్రమాదపరాభవంబుల నెంచక సమాయ కత్వంబున నిర్భయంబు దాండవించు కుతూహలచిత్తంబున జననీజనకులతోను సన్నదమ్ములతోను వక్కాణించెను.

జనకుం డేతత్స్వప్నభావంబుల నాలించి యాగ్రహస్వభావుండై ఓరీ! చిన్నవాఁడవని సోదరులందరికంటె మిన్నగాఁ బ్రేమించినందులకా, ఈగర్వాటోపచిహ్నంబులు. నీవు కనిన నీకలల వృత్తాంతంబేమి? నేనును, నీతల్లియును, నీ సహోదరులును నిశ్చయముగా నీ పాదాలకు మ్రొక్కుదుమా! ఇట్టి స్వప్నంబులఁ గని విమర్శించుట పాడిగాదు. కన్నకడు పగుటచే నేను క్షమించిన నీ సోదరులెట్లు క్షమింతురు? ఇఁక నెన్నం డిట్టి దురంత విప్లవంబునకు సాహసింపకు. పదుగుర దృష్టికిమంచివాఁడ వనిపించుకొని జీవించుట శ్రేయస్సు. తద్వార నీ భావిజీవిత కీర్తివిశేషంబులు పెంపగునని గద్దించుచు మందలించెను. కాని దూరదృష్టిగల తండ్రి మాత్రమా కలల వృత్తాంత ఫలితం బెట్లు పరిణమించునో యని యువ్విళ్ళూరుచు మరచిపోకుండ జ్ఞాపకముంచుకొనెను.

సహజదాయాదిద్వేష మహాగ్నిజ్వాలల విరఁజిమ్ముచు ద్విగుణీకృత కోపస్వభావులురై సహోదరులు సమయంబు కొఱకు వేచి పండ్లు నూరుచు కత్తులకు సానఁ బెట్టుచు గుటక్కలు మ్రింగుచు సాగరోపరిముక్తా స్ఫోటకముకై వడి బింకంబుల సారించుచు పొంచియుండిరి.

కాని యోసేపు దైవభక్తిపరాయణుండు. నిష్కళంక హృదయుండు. కపట మెఱుఁగని సత్యవాక్యస్వరూపి. ఒక చెంపఁగొట్టిన వేరొకచెంప నందించు పరమశాంతమూర్తి. హాస్యమునకైన ననృతమాడసాహసింపని సచ్చరిత్రుండు. భూతంబుల నన్నింటిని తనతో సమానమని భావించుచు పాలించు దయార్ద్ర హృదయుండు. పెద్దలఁ బొడఁగనిన నెదురేఁగి నమస్కరించు సదాచారసంపన్నుఁడు. అన్యకాంతల నరసి మాతృతుల్యంబుగాఁ బ్రేమించి యాదరాభిమానంబులవర్షించు పుణ్యశీలుండు. సిరులు పెల్లుబుకి తట్టుముట్టాడి వంచించిన నుంతేని తమకని ధీరోదాత్తుండు. ఆశ్రయించిన విపత్ప్రశ్రేణినైన ముదమార గారవించు పరమవదాన్యశేఖరుండు. దొసంగులు పొసంగినను, మహాపర్వతరాజంబులవలె సిలుంగులు వలఁగొనినను, దైవచింతనముదప్ప వేరొండు ధ్యానింపసాహసింపని భక్తాగ్రేసరుండునై జనకునిపజ్జ నల్లారుముద్దుగాఁ బెరుగుచుండె. కాలము కొంత యెడమయ్యెను. పూర్వ స్వప్న వృత్తాంతంబులమరచి మైత్రీభావముతోను నిష్కపట స్వభావముతోను నన్నదమ్ములతో సేవఁగావించుచుండె.

తాఁగనిన విపరీతస్వప్నవృత్తాంత భావంబుల మాత్రమన్నదమ్ముల హృదయాంతర్గతములై నాటుకొని వ్రేళ్ళుబారి శాఖోపశాఖలుగావిస్తరించి పరవంజెను.

జనకుని పంపున గొఱ్ఱెలమందల మేపుటకై పెద్దభార్య

కుమారులు దుర్గమాటవీ మధ్యప్రదేశంబున నేత్రోత్సవంబు గొలుపు 'షెకేము' అను శాద్వలసీమల కరిగిరి. కొన్ని నాఁడులు గడిచెను. జననీజనకుల క్షేమసమాచారంబులు కుమారులకు, కుమారుల క్షేమసమాచారంబులు జననీజనకుల కెరుకపడకుండె. జనకునికి కుమారులపై మరులుఁబుట్టి వారి క్షేమసమాచారంబులఁ గనుఁగొన నిచ్చగించి కొండొక నాఁడు ముద్దులపట్టియగు యోసేపును రావించి, కుమారా! నీసోదరు లరణ్యసీమలకు గొఱ్ఱియల మేపుట కరగియున్నారు. వారి క్షేమసమాచారంబు లింతకు తెలియమికి విచారంబు. కాన సత్వరమే వారికడ కేగి సవిస్తర కుశల ప్రశ్నంబులఁ గనుఁగొని తెలుపవలయును. నా హృదయము కంపించుచున్నది. పొమ్ము, రమ్ము. అని దీవించి సెలవొసంగెను.

తూర్పు రేఖలు తెల్లనయ్యె. దిశాస్తోమంబులు వికాసవంతంబులగుచుండె. చీఁకటుల దొరసాని చాలిపోయి విశ్రమింపఁ గొండగుహల తారాడఁజొచ్చె. కంచుకంఠంబుల విప్పార్చి పరువంపు టోపికతో కుక్కుటంబులు ధ్వనింపసాగె. కులాయంబులఁ బిట్టలు పీచుపీచుమనుచుండె. నానావిధ శకుంత సంతానంబులు కువకువ ధ్వనులతో సృష్టికి స్వాగతంబొసంగఁ జొచ్చె. ప్రకృతి మల్లెపూవుల చీరెను సింగారించుకొని వలపుచూపు టుచ్చుల మచ్చుజల్లి, జగంబును మోహనాబ్ధిలోఁ దేలింపసాగె. కమ్మపుప్పొడుల పటానులఁ గొల్వాఁదీరి ప్రత్యూష పవనాంకురంబు లాకాశగంగస్థలంబున విహరింపఁ

దాడంగె. ఒకరిపై నొకరు వరసపదాలబాడుకొనుచు రోకంటి పోటుల శ్రుతులగలిపి సరసంబులాడుచు కాపుచేడియలు పల్లవించిన నూత్న మోహావేళ పరవశత్వంబున గింజలు దంపుడు పెట్టుచుండిరి. రైతులు కోడెలుల బన్నిరి. గిలకల బావుల చప్పుడులకు, గిజిగాడులు కులాయంపు టూగుటుయ్యేలల మేలుకొని భగవత్స్మరణ గావింపు చుండె. ప్రాక్సతీ ప్రణయపరిష్వంగ సమారంభ కుంకుమపంకంబు గుప్పడము గప్పుకొని వేవెలుంగులదొర నిరుపమాన తేజః ప్రభావంబునా తూర్పు కొండసానువుల గద్దె నలరించి పశ్చిమ దిశాంగన మోహంపు జూడ్కులకు చేసైగలకు భ్రమసి మురిసిపక్కన నవ్వెను. పుష్పములపూఁబోండ్లయధరామృత రసాస్వాదన ప్రసారంబున మత్తెక్కి నిదురించు తేనెతిండ్ల దొంగబిడ్డల వెడలఁగొట్టి పద్మషండంపు టుయ్యేల గరువంపు మదంబున కమ్మకూన తెమ్మెర లల్లనల్లన విరుసుకొనసాగె. చిట్టిపొట్టల నింపుకొన నల్లజీమలదండు చంటిబిడ్డల వీపుమోపుల నెక్కించుకొని తండోపతండంబులుగా బారులుదీరి యంపరలాడుచు నకాయెకి బరువెత్తుచుండె.

అంత యోసేవు పితృనానతి శిరసావహించి చాలినంత చద్దిబత్తెముఁ జేకొని అన్నలకు వలసిన పదార్థ సంబంధ సామగ్రిఁగొని మాతలదీవెనలంది నిర్దోషియై కుతూహాల స్వాంతుండై

వయునమై నిజదైవ పాదారవిదంబుల సంస్తుతించుచు సత్వరపు నడల దుర్గమాటవీ ప్రదేశంబుల నడుమం జొచ్చె.

మదజల స్నానంబు లాచరించి పర్వత సానువులతో మార్కొను నడగొండలవంటి మత్తమాతంగంబుల ఘీంకార సంకులంబులు, క్రొవ్వుఁబట్టిన కోడముకుందేళ్ళ క్రొత్త కందరంబులమెక్కి మత్తిల్లి కొమ్మలకు బెనచుకొని బుసగొట్టుచు విసంబుల గ్రక్కుచు మండిపడు కొండచిలువల భయంకరార్భటంబులు, సెలయేటి యిసుకలంకల గుమ్మలు గుమ్ములుగాఁ బెరిగిన తుంగగడ్డల రొక్కముగ బొక్కి క్రొవ్వుఁబట్టి డొంకల చెంగలించు వరాహ మాంసరక్తంబులమెక్కి బలిసి నాల్కల సారించుచు బొదరిండ్లు మారుమ్రోఁగ గాండ్రించు వ్యాఘ్రసంఘంబుల యకారణపౌరుషజ్వాలల దుర్భరత్వంబు, రుచ్యంబులగు నానావిధఫలంబుల భక్షించి చిరుక్రొవ్వుబట్టి చంకపావల యేడ్పు మాన్ప శాఖాడోలికల నుఱ్ఱూతలూఁగు శాఖామృగసంచయంబుల సంబరంబులు, పువ్వుటీరంబుల తీయందనంబులాని కైపెక్కి భూమ్యాకాశ మధ్యప్రదేశంబున వలయాకారంబున బారులుదీఱి పఱిటీలఁ గొట్టు వనదంశంబుల పరువంపు సంపదల హొరంగులు, పాదంబుల బిగువున భూమి నరికట్టి బలిదంపు ముట్టెలసారించి, చెదలు దండులతో సంగరంబునకూని ఘుర్ఘుర ధ్వానులతో బోరాడు వెనుకచూపు మెకంబుల పంతంబులు, దట్టంపు టిరులుమూలుగు నికుంజపుంజంబులు, కాలువెట్టిన రక్తంపు

రుచుల దాండవించు పలుంగురాల యుక్కుబాకుల మండీలు క్రొందలిరాకు క్రొటారులం గొలువుండీటి క్రొసరిమెరవి మనోహరధ్వనులతో గోలాహలంబుం జేయు నానావిధ పక్షికుల సంతానంబు, కడుపుసాదచే బుడుతల కలుంగుల నిలిపి కడగండ్ల గుడుచుచు బక్కచిక్కి వకవకలాడుచు గ్రుమ్మరు సృగాలంబు లాగడవు టార్భాటంబులు, ముదిరి ఊసర వెల్లియై ప్రపంచ మాయా మేయువిచిత్రసమూహంబుల విమర్శించుచు, గినియుచు, సొక్కి పొరలాడు తొండల మండలంబుల నిశ్వాసంపు నిట్టూర్పుసెగల గలిగి గగుర్పాటు గావించు నక్షాంతారమం దేకాకియై సహోదరదర్శన కుతూహల సంరంభంబున నువ్విళ్ళూరుచు భయం బావంతేనిలేని చిత్తంబున తిన్నగా మెల్లగా సగ్గమించుచుండె.

ఎంతదవ్వరిగినను సోదరుల యునికిపట్టు దొరకకుండె. డ:యొత్తు గుండెలతో, వడకెత్తు చేతులతో, తూగాడు దేహయష్టితో, నదుల, నిధుల, శిలల, ములల, గుహాల గహనాదిభూముల తబ్బిబ్బుతో దాటుచుండె.

యోసేపు తత్తరపాటు నరసిన యొక బాటసారి తన్నుం డాసి జాలిమై నీదేయూరు? నీ పేరేమి? నీ వెవరవు? ఇటకే కారణాంతరంబున జనుదెంచితి వని ప్రశ్నించెను. యోసేపు వినమ్రభావంబును బొడిగించి నమస్కరించి నాది కనాను దేశము. నా సోదరబృందము గొఱ్ఱెకుల మేవుటకై కొలంది దినంబులక్రిత మీప్రదేశంబులకు వచ్చియున్నవారు. వా

రెటుబోయిరో, యెచ్చట నున్నారో జాడ దోచకున్నది. తమకు దోచనేని దయతో దెల్పిన వారిని గలిసికొందు నని ప్రార్థనపూర్వకముగా బ్రతిమలాడుచు విన్నవించెను.

అందులకా బాటసారి "వారిటనుండి 'దోతాను'కు వెళ్లుదము రండని వారిలోవా రనుకొనుచుండ విన్నాడను. ఆ ప్రదేశమున కరిగిన వారల జాడలను, క్షేమసమాచారంబులను గ్రహింపఁగల"వని వక్కాణించి వెడలిపోయెను. బాటసారి చెప్పిన యానవాలు వాలునుబట్టి యోసేపు దోతాను మార్గ మనుసరించి నడచినడచి సోదరుల గుడారంబుల గాంచి సంతోషస్వాంతుండై సమీపించుచుండె.

అదుగో! మమ్మేలుదునని నాఁడు స్వప్నంబులగని విశదీకరించి పరాభవముగావించిన యోసేపు వచ్చుచున్నాడు. సమయమెడమైన లభించుట దుస్తరము. వెంటనే వానిని వధించుట శ్రేయస్సు. పిదప వాని స్వప్నవృత్తాంతభావము లేమగునో చూతమని యొండొరులు బీరసాలుతీయుచు రోషంబుల గ్రక్కుచుండిరి.

సోదరుల పటాటోపంబులవిని రూబేను భయభ్రాంతుండై నేటికేదోయొక యుపద్రవంబు వాటిల్లుననుచు, తత్ప్రయత్నంబుల నివారింపఁ గొంతచింతించి, వారల చిత్తవృత్తి శమింప శాంత శమనోపాయంబులచే నూరటఁ గూర్చి తమ్ములారా! ఈదురంత విప్లవదుష్కార్యంబొనర్చుట భావ్యంబుగాదు. హఠాత్తుగా వానిని వధించుటకన్న కొన్ని

కష్టంబుల గలిపించి ప్రాణంబులతో వేధించుట సమంజస కార్యంబు. అకారణద్వేషవాచాకేళి వర్షించి తోఁబుట్టువును బరిమార్చిన లోకంబు నానావిధంబులుగ దూషించు. క్షేత్రంబులు వేరైనను బీజం బొక్కటియేగదా? నాఁడు వాఁడు మనయెడల గావించిన పరాభవంబు నాహృదయం బునుగూడ వేధించుచున్నదనుటలో సంశయము లేదు. ప్రత్యేక ప్రేమభావంబున జనకుం డొక వెలగల నిలువుటంగీ వానికి కుట్టించుట మనకెంతో పరాభవము. అయినను కారణంబులు కాలంబు లేరీతి వర్తించునో యెవరు గ్రహింపఁగలరు?

సాహసించి యేపనినైనఁ జేయరాదు. అవివేక మాపదల గూర్చును. సంపదలు సద్గుణంబుల యాచించు. కాపట్యంబు విహీనతకు కారణంబు. ఏపనినైన జక్కగా నాలోచించి విమర్శనజ్ఞానముతోఁ జేయవలయును. మానవుఁడస్థిరుడు. సుఖదుఃఖంబులు, ధనధాన్యంబులు బుద్బుదప్రాయంబులు. అస్థిర విభూతికి సంతసించి న్యాయవిరుద్ధంబులగు కార్యజాలంబుల నాచరించుట పాఁడిగాదు. మనలఁ బుట్టించినవారు గంపంత కన్నుతో నాకాశసింహాసనం బధిష్ఠించి పరిపాలించుచున్నవారు. విశాలమైన సృష్టిఁ గావించి, అందు మానవున కుపయోగపడునట్టి పదార్థసంచయంబు లోనఁగూర్చి యనుభవింపుఁడని యానతినొసంగె. అట్టి దైవసంకల్పిత సృష్టి ననుభవించుచు, నాతని సేవించి ప్రేమించువాని వంశ మాకాశ

నక్షత్రముల వలెను, సముద్రంపు టిసుక రేణువుల వలెను, వృద్ధిఁ బొందించి యాశీర్వదించును. దుర్మార్గపు చెయ్దములు చూపులు మానవుల మన్నుఁజేయును. పాపభూయిష్టంబైన నీప్రపంచంబు మానవున కొక పరీక్షా మందిరంబు. అందుఁ గష్టతరంగ పరంపరలు తెరలిపొంగులువాఱుచుండు. ప్రకృతి ప్రతి మానవుని ప్రతిసమయంబున వంచింప నూహించు చుండు. ఎవడు కష్టంబుల కోర్చుకొనునో, ఎవడు దైవశాస నంబులఁ బ్రేమించి మన్నించునో, ఎవడు పదుండ్రకు గలలో నాలుకగ వర్తించునో వాడై హికాముష్మిక సుఖంబులఁ నొందఁగలడు. దురాలోచనల గావించు మానవుం డెవ్వం డును పురోభివృద్ధి గాంక్షింప నేరడు. యోసేపును వధించిన మన మేమి లాభంబును గీర్తిని గాంచగలము. ఒకచో నాతని యంతశ్శక్తులే రాజ్యంబుల నేలనై యున్నవో! అతని వాక్కులే రాజన్యుని పజ్జ శాసనంబులై తాండవించునో! ఆతని యడుగుజాడలందే రాజ్యంబులు పుణ్యస్నానంబు లాచరింపనై యున్నవో! ఆతని చూపులందే దరిద్రిల చారి త్రంబులు బంగారుపూతలై రాణింపఁగలవో! ఆతని తేజస్సు నందే మహానుభావు లుద్భవించెదరో! ఆతని యాశీస్సులం దే దేశంబులు పచ్చని తోరణంబులతో నిత్యకల్యాణ ములతో రాజిల్లనై యున్నవో! మన జ్ఞానంబున కందని మహాశక్తులెన్ని వాని హృదయ గోళంబున జ్వలించుచున్న వోగదా! త్వరపడి యాతని భావిజీవిత కల్యాణదుర్గంబుల నెందులకు నాశనం బొనర్పవలయును.

ఇట్టి దుష్కార్యంబునకు సాహసించుట కన్న ప్రాణంబులతో నొక గుంటలోఁ గూలఁద్రోసి, బాధించుట శ్రేయోదాయకంబగునని హితవు నుద్బోధించుచుండు నంతలో యోసేపు సహోదరుల సమీపించి,నమస్కరించి. అన్నలారా! క్షేమమా! మీజాడలను మీ క్షేమసమాచారంబుల గనుఁగొని రమ్మని మన జనకుండు మీకడకు నన్ను బుత్తెంచెనని మనవిపూర్వకముగా మాటాడు నంత జననీజనకుల కుశల ప్రశ్నంబుల గావింపకయు,సోదరు లుద్రేకించి ఓరీ! డింభకా! నీవు మమ్మేలువాడవా; నాఁడు గనిన స్వప్నభావంబుల మఱచి యింతలోనే క్షేమంబులారయ మాకడకు వచ్చితివా! సరే యిప్పుడక్కల లేమగునో చూతమని, చెప్పుచు, మూతి బొడుచుచు మండిపడుచు తండ్రికుట్టించిన మురిపంపు నిలువుటంగీని నూడబెరికి నిర్దయులై మండూకసర్ప వృశ్చికసంకీర్ణంబగు నొక పాడుగోతిలో, విలపించి చేతులెత్తి దండంబులు బెట్టి ప్రార్థించిన విననొల్లక యోసేపును గుభాలున గూలద్రోసిరి. అప్పుడే లోకబాంధవుండు దినార్ధగతుండయ్యె.

భూమధ్య రేఖామార్గంబున తీవ్రకిరణజ్వాలల దాండవించి మండిపడుచుండె. పడమటి శాంబరములు దోలించి వీచుచుండె. దిక్కులు బీఁటవాఱెను. మృగతృష్ణ వార్ధులను బేరాసచే జింకలు చెంగుచెంగున బరువెత్తఁదొడంగె. పులుగులు కలుఁగులయందుఁ బరితపింపఁజొచ్చె. పాషాణ షండంబులు జిటబెటీలుమని బగులజొచ్చె, కార్చిచ్చు లెల్లెడల గ్రమ్ముకొనసాగె. ప్రకృతి దాహావాగురుల జిక్కుకొని పరి

తపింపఁ దొడంగె జీమూత సంచారశూన్యమై నభోంతరా ళంబొప్పెసు. వృక్షంబులు పత్రమిత్రంబులఛాయాసుఖదంబును జీవుల కొసంగజాలమికి సంతాపమొందసాగె. చెమ్మటబిందువుల చీదరకు తాళలేక మనుష్యజగంబు దత్తరింపసాగె, సంపన్నులు పట్టివేళ్ళదడులు మంజూషు వాకిండ్లకు గట్టికొని చల్లని నీరంబుల జల్లించుకొనుచు సుఖింపఁ దొడంగిరి. అగ్ని దేవుఁడు పెండ్లికొడుకై మారుతవాహనాసీనుండునై దిక్కులను గుబ్బటిల్లఁ బరిటీలగొట్టుచు నూరేగదొడంగె. ఏయెడఁ బరికించినను సెగలపొగల నుడిగాడ్పు దుమారంపు దండు లేగాని, పిల్లతెమ్మెరలువీచు జాడలే బొడఁగట్టకుండె. క్రిమికీటకాదులు కోటరంబుల నొదిగి పరితపించసాగె. ప్రొద్దు పొడిచీపొడవక ముందే ప్రాణులు నీడపట్టుల దాగి ప్రాణంబుల గాపాడుకొనుచుండె. ఆ తపబాధలకు జగంబుక్షోభించి కన్నీరు వెదజిందుచుండె.

అన్నలు మందల నొక్కయెడ నాపి భోజనము సేయుచుండిరి. దిక్కుమాలిన యోసేపు దీనాలాపంబుల నాలకించువారు మందునకైన గానరాకుండిరి. వేళ యతిక్రమించె. కడుపుమంటల కోతలకు తాళజాలని యోసేపు గోతిలోఁ గన్నీరు మున్నీరుగాఁ బ్రవహింప నేడ్వఁ దొడంగె. ఆదరించువారరుదైరి. గాలితాఁకున తెల్లు గడగడలాడు నట్లన్నంపు లేజరమున జిక్కి సొక్కిసోలి సొటసొటలాడుచుండె. చెమ్మట జల్లులు తెంపులేక వర్షింపసాగె. అంతకంతకు హృదయావేదన మిక్కుడగుచుండె. కోమలశారీరవిలాస సౌకుమార్యసంప

తలు వాఁడిపోఁజొచ్చె. లాలాజలగ్రంధు లెండిపోయె. నాలు కపై జీలువాఱు చెమ్మలారిపోయెను. మాట తడిబిడి బడు చుండె. గద్గదస్వర మేర్పడె. కనులు లోనికి గుంజుకొనిపోవు చుండె. వెఱ్ఱిచూపులు మెండుకొనె. మరణమే తుదకు శరణ్య ప్రాయమై జాలిమై తత్తరించుచు దేవా! పరంధామా! జగ ద్రక్షకా! ఆపన్నశరణ్యా! లోకబాంధవా! ప్రతిపత్తివిపత్తా! భక్తమందారా! నీ భక్తుఁడనగు నాకువాటిల్లిన కష్టశరపరం పరలఁ దుదముట్టింపవా? కరుణింపవా! శరణార్థినగు నన్ను కటాక్షింపవా! ఓ విమలప్రభావా! నీదృష్టిలో నేఁ గావించిన సమస్తాపరాధంబుల మన్నించి నీసేవకునిగాఁ గటాక్షింపవా? నీభక్తుల నెండఁబోని గాపాడ లేదు? సర్వజ్ఞుండవై జగంబును న్యాయదృష్టితోఁ బాలించు నీకు నే నొక్కరుండ బరువైతినా రక్షింపఁబడుటకు? నీప్రభావము, నీ మహిమాస్వరూపము నీ దాక్షిణ్యమానసంబు నీ సృష్టివైపరీత్యంబు మహాకవియోగ పుంగవుల దృక్పథంబుల కందక తల్లక్రిందులగుచుండ నందు నే నెంతపాటివాడను. మానవులబుట్టించి పోషించి గాపాడు టకు నీకంటె శక్తిసంపన్నుండు మఱెవ్వడు? నా భావిజీవిత క్రమంబున కీవే గదా మార్గదర్శివి. ఓ జగన్నాటకసూత్ర ధారీ! మదగ్రజుల చిత్తవృత్తులను బరివర్తనగావింపఁజేసి, నీ చిత్తమైనచో నన్ని నరకకూపంబునుండి విముక్తునిగావిం మనుచు, ప్రార్థించుచుండె.

తత్సమయంబున ఇస్మాయేలీయులగు కొందఱు బేహారు లొంటెలపై గుగ్గిలము, మస్తకి, బోళము నొంటెలపై నెత్తుకొని గిలాదునుండి ఐగుప్తుదేశమున కరుగుచుండిరి.

రూబేను మాత్ర మాసమయంబున వారికడ లేడు. రెండవయన్నయగు యూదా సోదరుల నవలోకించి, సోదరులారా! యోసేపు మనరక్తసంబంధియే కదా? వానిని దెగటార్చుటవలనమనకపకీర్తిసిద్ధించుటయేగానిసత్కీర్తిసేకూరదు. కాన వాని కేకీడు వాటిల్లనీయక, ఆవర్తకుల కమ్ముట శ్రేయస్సౌభాగ్యము. అనిసోదరులకు జెప్పిమెప్పించి యోసేపును గోతినుండి పైకితీసి నిలువుటంగీని విడిపించి యిరువది తులముల వెండినాణెములకా వర్తకుల కమ్మివేసిరి.

కన్నీరు మున్నీరుగా గురియు యోసేపును జేకొని వర్తకులు నడువజొచ్చిరి. చివాలున తలిదండ్రులు, అన్నదమ్ములు స్మరణకువచ్చిరి. బ్రహ్మాండమంతటి మరులుప్రాంగెను. అడుగులు తడబడుచుండె. గుండె దడదడ కొట్టుకొనసాగె. తన్ను గడుపారగాంచిన గడ్డవైపు తేఱిపాఱజూచెను, పొరలివచ్చు దుఃఖతాపంబుల నాపఁజాలకపోయెను. అకటా! నన్నుగనిపెంచిన నీ నేలకును నాకును నేటితో ఋణానుబంధంబులు దీఱిపోవుచున్నవి గాంబోలు. ఈ గాలితో నీ నీళ్లతో నీగడ్డిగింజలతో బెఱిగిన నీ శారీరం బే కాటినేల కప్పగింపవలసి యున్నదో గదా.

చెమ్మట బిందువుల వెలార్చి యావజ్జీవిత శేషంబు ధారవోసి, కాననంబులను ఫలభూములుగా జికిలి గావించిన నా

పెద్దలందరు దాగిన నీ పున్నెంపు నేలలందుఁ నాతనువు నర్పిం
చుకొను త్రాఁత లెడమయ్యె, నా యస్తికల దాచ నేగడ్డ
నోఁచుకొని యున్నదో గదా? నన్ను మోసికొనిపోవుట కేరి
భుజంబులు కాఁచుకొని యున్నవో? యెంత నిర్భాగ్యుడను.
తలితండ్రు లేమగుదురో? అని వాపోవుచు, తన పాద
పర్యటనచే ధన్యత జెందిన భూములను సోదరులను గన్నార
జూడఁజూచుచు నలవిదప్పిన దుఃఖపరితాపంబుల వెడల
బుచ్చుచు మాతృభూమిపై బొరలు మరులును మఱల్చుకొన
జాలక క్రుంగికృంగి వేసారుచు దన్నలమికొన్న విపద్దశను
తప్పించుకొన జాలక బహువిధంబులఁబరితపించుచు తలయెత్తి
యాకసమువంక జూచుచు, గన్నీరు రాల్చును. గ్రుక్కలు
మ్రింగును. పొరలివచ్చు హృదయాలోచనల నాఁపజాలక
నేలరాయుచు, గొంతతడవద్దియో జింతించుచు నడువక
జాగుసేయును. వర్తకులాగ్రహించి ఓరీ! నీవుమావెంట శీఘ్ర
మే వచ్చెదవా, లేక మాపైకమునుమాకిచ్చి నీసోదరులచెంత
కరిగెదవా? అనిగద్దించుచు నెట్టుకొనిపోవుచుండిరి. తప్పనిసరి
యనుకొని, పరదేశంబున మాతృదేశ స్మరణాది భాగ్యంబు
లుండవలయునని తల్లిగడ్డను బెకలించి చేరెడు మట్టిని చేఁ
గొని కనుల కద్దుకొని భద్రముగ కొంగున ముల్లెగట్టుకొని
తన భావిజీవిత గ్రంథంబున బొడఁగట్టఁబోవు మహాద్భుత
భయానక రసోచిత దృశ్యంబులఁ బిండీకృతుండగుచు వర్త
కుల వెంబడించి ముక్కుచు మూల్గుచు, మెల్లగ నడువ
జొచ్చెను.

యోసేపును వర్తకులకు విక్రయించు నాటకాంతరంబున రూబేను సోదరులకడ కేటనుండియో వచ్చెను. గోతిని తొంగి చూచెను. యోసేపు లేకపోయెను. గోడుగోడున నేడ్వఁజొచ్చెను. బట్టలు చింపుకొనెను. నేలఁబడి దొరలాడ సాగెను. సహోదరుల సమీపించి చిన్నవాడేమయ్యెనని కన్నెఱ్ఱఁజేసి గద్గదస్వరంబున ప్రశ్నించి దూషించుటకు మొదలుపెట్టెను. సోదరులందరొక్కుమ్మడి రూబేనుయొక్క మహోద్రేకంబునాపి తత్కాలోచిత సమాధానంబులచే నూరటం గూర్చి యోదార్చి, యొక మేకపిల్లను వధించి రక్తంబుదీసి యందుఁగీని బులిమి తండ్రికడ కేతెంచి యిదిమాకు మధ్యే మార్గంబున దొరికినది. నీ కుమారునిదానో కాదో గురుతు పట్టుమని జూపించిరి. జనకుఁడద్దానిని బరీక్షించుచుండునంత యోసేపు దుష్టమృగంబులచే హతుఁడయ్యెనని కుమారులంద రేకగ్రీవంబున జెప్పుచు రూఢి పర్చిరి.

కర్ణకఠోరంబగు తద్వాక్కు వినినంత మిన్నులు గూలినట్లు గుండెలు బ్రద్దలుగ బగిలి నేలగూలెను. మతి దప్పెను. వాక్కు స్తంభించెను. అనివార్య విషాద నేపథ్యంబులు నేత్ర జగంబును గ్రమ్ముకొనియె. కొంతసేపటికి తెప్పరిల్లుకొనియె, దుఃఖంబు ద్విగుణీకృతంబగుచుండె. నేలకు తల మోదుకొనఁ జొచ్చెను. రాలుగఱగు నట్లు విలపింపఁదొడంగె. కుమారులెంత యోదార్చి శాంత శమనోపాయంబుల నూరటంగూర్చిన పొంగిపొరలివచ్చు హృదయ దుఃఖ పరితాప భారంబుల నాపలేకపోయిరి. పుత్రవియోగ సంజనిత విషాద

జ్వాలల సంతప్తుఁ డగుచు జనకుండు విక్లాంతంబులబడి మూల్గుచుండె.

కంటకావృత సముద్ధత కాననంబులబడి యోసేపును వర్తకులు బలవంతముగ నడిపించుచుండిరి. మార్గమంతయు భయాకీర్ణంబై గుండె జలదరింపుఁ జేయుచుండె క్రోల్పులులు బొదరిండ్ల గుఱకలు వెట్టుచు నిదురించుచుండె. రేచుకుక్కలు బారులు దీరి గుంపులుగుంపులుగాఁ బరువెత్తుచుండె. బారుటీటలవంటి నిశాతశృంగంబుల విదళించుచు బోతరించిన కాఱెనుబోతులు లోడలుమఱచి దట్టంపు లతానికుంజంబుల నెగిరెగిరి దూఁకుచుండె, కొండ నెత్తంపు బోలుగాళ్ళ శిఖరంబుల బవ్వళించి కొండముచ్చులు పైఁబడి కఱువఁబోవునట్లు దూఁకులు వెట్టుచుండె. ఎలుగులుపులుఁగులు భయంకరంబుగ ధ్వనించుచుండె ఆగడపు గాఱుచిచ్చులు భయదస్వరూపంబున నివ్వటిల్లి విజృంభించె. ఎటుఁజూచిన భయంకరంబులైన నినాదంబులె వినఁబడఁజొచ్చెను.

దిక్కుమాలిన యోసేపు పెల్లాకట దొసంగుల నీదలేని తాపంబున బంకచెమటలు పాతరలాడు దేహంబును దుడుచుకొనుచు, వచ్చనగాయ లారఁబోసినట్లు లోకొక్కపట్టున సన్నబల్లేరుముండ్లు చుట్టుచుట్టున గ్రుచ్చుకొనుచుండ, కోటల వలెదట్టంబుగఁ గిక్కిరిసి పెరిగిన గచ్చపొదల మదుగులతిన్నతిన్నగ వంగివంగి పాఁకుచు వర్తకుల వెంబడించినడచుచుండె.

నడచినడచి కుమిలి కూలారి విసిగి వేసారి తుదకు యోసేపు వణిగ్గ్రామణులతో నైగుప్తపట్టణంబు జేరె.

ప్రొద్దులు గ్రుంకెను. సంజతిర్లకలు ముట్టించిరి. పుట్టుగ్రుడ్డికిని వలెనే పుండరీకాక్షునకును గనులుగానరాని కాదంబినీ పరివృత కాళరాత్రిను భయంకరంబుగ జగంబును గబళించె. నిశీధినీదేవి కాఱుమబ్బుల నతిక్రమించు శ్యామలకుంతలంబుల విరయఁబోసికొని నివ్వుల దివిటీలసాము జేయుచుఁ, బిశాచీ సేవకాబృందంబు లాశీర్వదింప నిక్కుచునీల్గుచు విశ్వప్రపంచంబు తత్తరింపనటింపఁజొచ్చె. పక్షిదంపతిచయంబు పసిబిడ్డల కాహారంబుఁగొని నాతురతతోఁ గులాయంబుల కేకాయెకిగ బయగిడుచుండె. కన్నుల జింతనిప్పుకలరాల్చుచుఁ గోటరంబులవీడి భయంకరంబుగ గూయుచు బరిటీలఁగొట్టుచు దివాంధంబులు జగంబును వెఱపింపఁదొడంగె. కబోదిపక్షులు చీఁకటి దొరసానికి స్వాగతంబొసంగుచు ముష్టిఫలంబులఁ గడుపార మెక్కి తండోపతండంబులుగ విహరించుచు దమప్రసామ్రాజ్యంబు నేలఁదొడంగె. వనచరులు మ్బ్చలను, మచ్చ్బలకత్తుల కటారుల పొదలలోదాపుకొని యేనులను, మనుబోతులను, దుప్పులను, లేళ్లను, కుందేళ్లను వేటాడుటకై మూఁగసైఁగలతో బిరబిర పోవుచుండిరి. సృష్టినిశ్శబ్దమై నిద్రాపారవశ్యంబునమునింగె. ఈదరగాలి తోలించిపిచుచుండెను

నాఁటి రాత్రమందెట్టులో కాలయాపనంబు గావించి, పెందలకడ నిదురమేలుకొని కాలకృత్యంబులందీర్చి, యోసేపును విక్రయించు కార్యక్రమంబునకు వర్తకులుపక్రమించిరి.

తత్పట్టణంబునంగల వాడవాడల యోసేపును వెంటగొని 'కొనుడు, అమ్మెద'మని కేకలువెట్టసాగిరి. తత్కార్యభారంబున కెవరు సాహసింపకుండిరి.

తుదకుపోతీఫరుండు యోసేపు తేజోముఖవిలాసచిహ్నసంపదలనరసి సంతోషించి వర్తకులుగోరిన ద్రవ్యంబొసంగి తనస్వాధీనంబుగావించుకొనియె. రూపరేఖాలావణ్యసంపదలతో పాటు యోసేపునకు నిండుజవ్వనంబు పరిమళించె. ప్రతిభాస్వరూపులు గణింపంగాగల విజ్ఞానభాగ్యమార్జించె. సౌశీల్యమందును, ఆచారనిష్ఠలయందును, సూనృతవచోవిలాసంబులందును, విజ్ఞానసూత్రాంశములందును, కుశాగ్రబుద్ధి సంపత్తులందును నాటి తేతెను. వ్రతనిష్ఠలో దిట్టయై సత్యవాక్యపరిపాలనా విధానంబున మిన్నయై, పారమార్థికచింతా దక్షత్వంబున దక్షుండై పరస్త్రీవిముఖత్వంబున ప్రజ్ఞగడించి వర్తించుట గాంచి యోసేపునకు పోతీఫరుండు తన గృహాధిపత్యంబొసంగి గారవంబున బ్రేమింపందొడంగె.

యోసేపు త్యాగియై, పరోపకారపారాయణుండునై పాపభీతిమానసుండునై, దయాదాక్షిణ్య సంపూర్ణుండునై, పూజితచారిత్రుండునై, ధీరోదాత్తుండునై, పాపపుణ్యవిమర్శనాకౌశలుండునై, అభ్యాగతులనాదరించుచు, బెత్తనంబున న్యాయదృక్కులవిరఁజిమ్ముచు, గర్భదరిద్రులఁ గనికరించుచు, నవీనశాసనంబుల సృష్టించుచు, ఆనందదాయకంబగు కార్యసమూహంబుల గల్పించుచు, కారణకార్యంబుల జింతించుచు, దేశోపద్రవ నివారణోద్యంబుల బన్నుచు క్రొత్త క్రొత్త

మొత్తులనెత్తుచు, దుర్మార్గుల చూపులతో బెదరించుచు, సజ్జనబృందంబుల మిత్రుడై, సహజౌదార్యసంపన్నుడై, సర్వత్ర సామరస్యభావపాశంబుల బంధింపబడి సుగుణంబుల పేటియై, యేలిక శాసనామ్నాయంబుల వాలెతింగిన ధీరుండై లోకుల దృక్పథంబునకు హెచ్చగుభావంబుల నార్జించి, భగవదాశీర్వచన పరంపరల గడించి సుకుమారుండై మెలంగుచుండె.

అతడడుగుబెట్టిన భూములతిసారవంతములై పచ్చిబంగారంపుబూవుల బండించుచుండె. గోస్తనీవన్యంబు లతిపుష్కలంబుగ ఫలించుచుండె. ధేనువులు ముప్పూట లుబ్బువేయకయ బాలంబిండుచుండె. కొలువనికొటారులుగ ధాన్యము విస్తరించి బండుచుండె. నెలమూడు వానలు వర్షించుచుండె. పాడిపంటలయందును, గరువంపుసిరుల బరువుల యందును, నిస్తులభోగభాగ్యంబులందును, కొఱంతలేని ధర్మంబులందును, సుంతేనిలోపంబులేక పోతీఫరుని సంస్థానము విర్రిద్ర ప్రభావంబుల నార్జించి, మూండుపిందెలాఱు కాయలతో నుబ్బూతలూగుచుండె.

పోతీఫరుని యర్థాంగి చెక్కి చేసిన జక్కదనంబుల బైడిబొమ్మ; కాకిచిప్పలవంటి కాటుకకన్నులు; దిద్దిన కోటేరువంటిముక్కు; పదాఱువన్నె బంగారపు సొరును మించు దేహచ్ఛాయ; తుమ్మెదఱెక్క లవంటి నెరికురులు; పున్నమ చందురునివంటి ముఖకమలంబు; రాయంచల కీడగు నొయారపునడకలు, అరికాలున తామరపువ్వు; వీపున వింజామరంబులు; పండ్లలో వరసవేణి గలిగిన యాలేమ చూపఱుల

మోహింపఁ జేయుచు, వడివంకలేక పొంగిపొరలు యౌవనా ర్భటిచేఁ గన్నుమిన్నుఁగానక వర్తించుచుండెను.

యోసేపు సౌశీల్య సౌజన్యరూప రేఖావిలాస సంపదలఁ గాంచి తత్కాంత మోహానురాగాతిశయంబుల బొడిగించి నాతని పైగన్ను వేసి వర్తింపసాగె. యోసేపును గాంచి నప్పుడెల్ల నయ్యింతికి మన్మథావేశ మెక్కుడగుచుండె. కను లతోను, చేతులతోను చూపుటీరంబులచేతను మవ్వంపు నవ్వులసవ్వడతోను, సైగలఁ జేయఁ బ్రారంభించె. తొందర పడుచుండు. కూడు తినదు, నిదురబోదు. ఆతురతతో నట్టిట్టు తిరుగులాడు. మోహావేశపరవశత్వంబున నట్టినిలువం బడి బెదరిన లేడిలేమవలె బిత్తరబిత్తర చూపులతో నల్దిక్కుల బరికించు. యోసేపు బిగిగుబ్బ గౌఁగిటిలో సుఖించు సమ యము కొఱకు పొంచి పోరాడుచుండె. తన్నారీమణి వికార చేష్టలు యోసేపు దృష్టికి ములుకులవలెనాటె కాలంబులు కారణంబు లెట్లుతప్పివచ్చునో యని కుమిలికూలాడఁజొచ్చు చుండె.

కొండొకనాడు, పోతీఫరుండు కొలువుకూటంబునకు జనియె. సేవకులంద లేపనివా రావనికి పోయిరి. ఇంటియందు యోసేపు పోతీఫరుని భార్యదక్క మఱెవ్వరు లేరు. సమయం బాటివచ్చినదని సంబరంబునొంది యొంటిమై పయుండిన యోసేపు గదిలోనికి బిరబరఁ బోయిహఠాత్తుగా గౌగిలించి గట్టిగబిగబట్టి ముద్దాడి కోరిక చెల్లించుమని దైన్యంబున మన్మథవికారంపు జూడ్కులతో ప్రార్థించెను,

యోసేపుత్రుళ్ళిపడి చివాలున మంచముదిగ్గి గడగడ లాడుచు నమస్కరించి అమ్మా! నీవు నాకు తల్లివి. నేను నీకు పుత్త్రుఁడ. నీసంబంధపాపంబు తరతరంబులవఱకు నన్నును, నావంశంబును వేదనలపాలు గావించు. జీవితమం దింతవఱకిట్టి దుష్కార్య మాచరించి యెఱుఁగనట్టి సత్యవ్రతుండ. మీఁదట దైవదృష్టి కెంతో హేయంబు. నన్ను నమ్మిన నా ఱేని కొంపకు నిప్పునంటించు నంతటి దుష్కార్యంబునకు సాహసింపఁజాల. విశ్వాస ఘాతుకమైన కార్య మింతకంటె వేరొండుగలదె? నీ ప్రక్కల నీ ఱెక్కల మెలఁగి నేఁటికీ దుస్థితిపాలుపడుదునా. అని వేవిధంబుల బతిమలాడుచు తిన్నగ తప్పించుకొని నావెడు పట్టుకొనిన యుత్తరీయం బచ్చోటనే వదలి యెటులో పారిపోయెను.

మన్మథో(ద్రేక వ్యథాభరంబున సంతప్తమగు నయ్యింతి వెంటనే దేహంబును గాజువక్కలతో జక్కుకొని మగఁడు కొలువు జాలించి యింటికేతెంచుసరికి కన్నీరు కాల్వలై ప్రవహింప నేడ్చుచు ముప్పతిమము సున్నమూ గాయములకు వేయించుకొని ముక్కుచు మూల్గుచు పరుండెను. పోతీఫరుఁడింటి కరిగెను. కళావిహీనమై గబ్బిలములు చరలాడుచుండెను. అర్ధాంగి శయనించిన మందిరంబున కరుదెంచి, కామంపు మైకంబున గండ్లుగానరాని సతిని తిన్నగ మేలుకొలిపి నీనిట్టూర్పులకు కారణంబేమని బుజ్జగించి యడిగెను. ఆవె దంతమేలుకొని తొట్రుపాటు జెందుచు కన్నీరురాల్చుచు నాథా! అల్లారుముద్దుగా నీవు సాకుకొనుచున్న యోసేపుఁ

డీనాఁడు నన్నొంటిపై గదిలోఁ బట్టుకొని పరాభవంబు గావించి బహువిధంబుల వేధించి తుదకు సమ్మతింపని కతంబున జంపుటకు ప్రయత్నించి దేహమంతయు అక్క గాయంబులఁ గావించె. తన పైవస్త్ర మీగదియందే వదలి యెటో పాఱిపోయె. కాని వానితోడ గలిసి వర్తించిన హాని వచ్చు నెంతవానికైన ననుసామ్య మిత్తఱిఫలించినది. పరుల హృదయ రహస్యంబు లెఱుంగనిదే తావాసంగుట యధర్మము. వాడేదేశస్థుడో యేకులస్థుడో గ్రహింపకయ స్థానమొసంగిన దోషమీరీతి పరిణమించినది. అని యున్నవికొన్ని లేనివి మఱికొన్ని కలిపించి నూరిపోసి తామను మెక్కించెను.

తోఁకద్రొక్కిన కోడెత్రాచువలె పోతీఫరుండు మండిపడి యోసేపును రప్పించి కొరడాలతోఁ గొట్టించి దండించి కఠినముగ శిక్షించి, న్యాయాన్యాయ విచక్షణలేక ముక్కిపోయిన మొక్క జొన్నల కూడు బెట్టనియోగించి చెఱసాల పాలు గావించెను. సుకుమారుండై రాచపోకడల ననుభవించిన యోసేపు కష్టపరంపరలకు మేరయేలేకపోయెను. కాని భగవంతుఁడు ప్రత్యక్షమై యుండు కతంబున కొలఁది దినంబులు గడచునంత కారాగృహాధిపత్యంబు యోసేపునకు ప్రాప్తించిసమస్తవిధంబుల గౌరవనీయుండై వర్తించుచుండె.

తద్దేశాధిపతియగు ఫరో మహారాజు కొలువున నపరాధం బొకంఁడు గావించిన కారణానంతరమున పానదాయకునకు భక్ష్యకారునకు చెఱసాలశిక్ష ప్రాప్తించి యోసేపు యున్న చెఱసాలయందు బంధింపఁబడిరి. కొలఁదిదినంబులు

గడచిన నంత కొండొకనాఁటిరేయి పానదాయకుండును, భక్ష్యకారుండును వేర్వేఱు కలలఁగనిరి. తెల్లవాఱెను. వారిరువురకుఁ జింతావారాశిలో మునిఁగి తేలుచు దిక్కు దోచక భయభ్రాంతులై వికారస్వరూపంబున గన్నీరు డించుచుండునంత యోసేపు వారిదుఃఖ ముఖ చిహ్నంబుల బరీక్షించి ఎందులకు మీరీరీతి వగచుచున్నారు. కారణం బేమైయుండునో దెలుఁపుడని ప్రశ్నింప వారలు నమస్కరించి మహాత్మా! గతరాత్రమందు మే మిరువురము భయంబు గొలుపు విచిత్రంబైన కలలను గంటిమి. తద్భావంబులఁ దెలియమికి చింతించుచున్నారమని వినమ్ర భావంబున వక్కాణించిరి.

భక్తవత్సలుండును ఆశ్రితరక్షాదక్ష సమర్థుండును నగు యోసేపు దైవమును ధ్యానించి దీర్ఘాలోచనా ధురీణుండై వారల నవలోకించి భావికాలోచిత ధర్మంబులు దైవాధీనంబులు. అయినను మీ రాకలల చెప్పఁగలిఁగితి రేని కొంత విచారింపఁదగునను సమాధానముతో నభిప్రాయంబును సూచించెను. అంత పానదాయకుండు యోసేపు నవలోకించి నమస్కరించి మహాత్మా! "ఒక ద్రాక్షావల్లి ప్రత్యక్షమైనటుల, దానికి మూడుతీగ లుండినటుల అదిచిగిరించి పూలతోను. పిందెలతోను. ఉత్తూతలూగుచున్నటుల పక్వమైన తత్ఫల రసంబును ఫరో మహారాజున కిచ్చినటుల గలగంటి"నని చెప్పెను.

ఆమూఁడు తీగెలు మూఁడు దినములు, ఇఁక మూఁడు దినములలోఁగా ఫరోనీతలను పైకెత్తి నీయుద్యోగము మరల నీకిచ్చును. వెనుకటి రీతిగా నీవతనికి పానదాయకుండవై సమస్త విధంబుల మేలును గడించి వర్ధిల్లగలవు. నీ యేలిక ద్రాక్షారసంపు గిన్నెను మరల యప్పగింపఁ గలవను భావము విశదీకరించుచు నిర్దోషినై నేనీ చెరసాలయందు బంధింపబడితిని. హెబ్రీయుల దేశమునుండి దొంగిలించఁబడిన నిర్భాగ్యుడను. నా పేరు యోసేపు. నీవు క్షేమకాలంబు లభించినపుడు కటాక్షించి మఱచిపోక నీయేలికతో నన్నుగుఱించి విన్నవించి యీ చెరసాలనుండి విముక్తునిగా నొనఱింపవలయును. సజ్జనుల సహవాసము సహస్ర విధంబుల శోభను సమకూర్చును. ఆశ్రితుల రక్షించుటే తమబోటి పెద్దలకు ధర్మంబు. కాలంబు మంచిదై యొకని వరించిన సమయంబున నాతనికి దోఁచిన సాయ మొరుల కొనర్పఁ బూనవలయును. దురభిప్రాయంబుల సంకల్పించుకొని కీడు జేయ సమకట్ట నుంకించరాదు. మన మస్థిరులము ధన ధాన్యంబులు క్షణభంగురంబులు. సాధ్యమైనంతవఱకు మేలునే చేయ యత్నింపవలయును. జన్మ భూమిని బంధుమిత్రులను జననీ జనకులను వదలి యేకాకినై దినంబుల లెక్కబెట్టుచు, నెట్టులో యీ చెరసాలసీమఁ గాలయాపనంబు గావించుచున్నాడ. నా విముక్తి, నా బ్రతుకు, నాజీవితము, నీహస్తగతమై యున్నటుల గానుపించు చున్నయది. నీవు మంచి కాలము ప్రాప్తించినప్పుడు తప్పక నాకు సాయము

చేయుటకు మఱువకుము. అని మనవి పూర్వకముగ విన్నవించి పుత్తెంచెను.

భక్ష్యకారుండు యోసేపు నవలోకించి తెల్లని పిండివంటలు గల మూఁడు గంపలు నాతలమీఁద పెట్టఁబడెను. మీఁద గంపలో ఫరోనిమిత్తము తయారు పరచఁబడిన సమస్త విధ రుచ్యంబులగు పిండివంట లుండెను.

పై గంపయందున్న పిండివంటలను పక్షులు దన్నుకొని పోయితినుచున్నట్లు కల గంటినని చెప్పెను.

అందులకు యోసేపు కొంత చింతించి "యింకొక మూఁడు దినములకు ఫరో నీ తలను పైకెత్తించి మ్రానుమీఁద వ్రేలాడదీయించి చంపించును. పక్షులప్పుడు నీ శవముపై చరలాడుచు మాంసమును దినునని కల భావంబును విశదీకరించెను."

యోసేపు జెప్పిన జొప్పున పానదాయకునకు మూఁడవ నాఁ డుద్యోగము ప్రాప్తించెను. భక్ష్యకారునకు శిరంబు ఛేదించు శిక్ష ప్రాప్తించెను. కాలము కొంత యెడమయ్యెను. పానదాయకుఁడు యోసేపు కారాగృహంబున గావించిన మేలు వాలుజాలుమఱచి పోయె.

కొన్ని దినంబుల తరువాత ఫరో మహారాజొక స్వప్నంబును గనెను. "తానొక యేటి సమీపంబున విహరించుచు నిలువంబడియుండ, అందమైనవియు బలిష్ఠమైనవియు నైన యేడావు లేటినుండి బయలు వెడలి యొడ్డుజేరి జమ్మును

మేయుచుండెను. తరువాత వికార స్వరూపంబున దూగాడు బక్కచిక్కిన మతేడావులు నదీగర్భంబునుండి దరిఁజేరి జమ్ము మేయుచున్న బలిసిన యేడావులను తినుటకు ప్రారంభించెను. మేలుకొనెను. కొంతతడవు జింతించి మరల నిదురించెను.''

మంచి పుష్టిగల యేడువెన్ను లొక్క దంటున బుట్టెను. తూర్పు గాడ్పుటీతిచే బలహీనమైన నేడు పేలవెన్నులు వాటి తరువాత బుట్టె, బలిష్టమైగింజలతో సొంపౌన గూర్చు యేడువెన్నులను మ్రింగివేసె నట్లు రెండవ కలఁగని గగురుపాటు జెంది త్రుళ్ళిపడి నిదుర మేలుకొని తబ్బిబ్బులై తనకు గ్రాహ్యాము గాక విచారింపఁ దొడంగె.

తదుపరి ఐగుప్త దేశమందున్న విద్వాంసులను జ్యోతిశ్శాస్త్ర ప్రవీణులను, వేద వేదాంగ పారీణులగు విద్వజ్జనంబులను రావించి తాఁగనిన కలల జెప్పి, విశదీకరించిన వారికి కోరిన దేనినైన నొసంగెదనని వాగ్దానము గావించె. ఏతత్స్వప్న భావంబుల విశదీకరింపఁ జాలక తత్సభను పూజించిన పండిత శ్రేణి, జెప్పక కొందరు, మిమ్మొకతూరి మరల దర్శింపఁ గలమని కొందఱు, స్వప్న భావంబును విశదీకరింప మా తరముగాదని కొందఱు, లేనిపోని సాకుల జెప్పి మఱి కొందఱు తప్పించుకొని పాఱిపోయిరి.

పానదాయకుండు తన పూర్వ స్వప్న వృత్తాంతముల జ్ఞాపకముజేసి కొని చివాలున తన యేలికను దర్శించి ప్రభూ! మఱచితి. క్షమింపుడు. యోసేపు డను హెబ్రీయుఁ

డొకం డీచరసాల యందున్నవాడు. నాఁడు చెరసాలయందు నేఁ గనిన కలల భావమున్నది యున్నట్లు విశదీకరించె. ఆతఁడె నచో మీకలల భావంబును స్పష్టీకరించ గలడని మనవిఁ జేయ, నరనాథుండు సంతసించి యోసేపును రావించి క్షౌరము జేయించి చీనిచీనాంబరంబుల నలకరింపఁ జేసి, సింహాసనంబునకు రాఁ గాంచి, యాసన మిప్పించి గౌరవించి తగు మరి యాదలచే గౌరవించి తృప్తిపఱచి తాఁ గనిన కలల విధంబు నక్కాణించెను.

తప కనేక విధంబుల శుభంబుల సేకూర్చు నిజదైవంబును స్తుతించి ఫరోరాజన్యునకు నమస్కరించి, అఖండ జ్ఞానంబు నుపయోగించి, 'రాజేంద్రా! బలిష్టమైన సప్తధేనువులుసప్త వర్షములు ఏడు మంచివెన్నులేడు సంవత్సరములు. రెండు కలల కొకటే భావము, చిక్కిపోయి వికార స్వరూపంబున పైకివచ్చిన యేడావు లేడు సంవత్సరములు, తూర్పు గాలిచే చెడిపోయిన యేడు పీలవెన్నులు క్షామ డామరము సంభ వించబోవు యేడు వత్సరములు. ఐగుప్తదేశ మంతయు బహు సమృద్ధిగాఁ బంట బండు నట్టి ఏడుసంవత్సరంబు లిఁక రానైయున్నయవి. కఱవు గల యేడేండ్లపై భయంకరంబుగ పుంజీభవించును. అపార పుష్కల సస్యప్రసన్నతచే ఐగుప్త దేశ మాయేడేండ్లు పొంగిపోవును. మీఁదట రాఁబోవు యేడేండ్లకఱవు దేశమును పాడు జేయును. ఇయ్యది దైవ సంకల్పము. కాబట్టి దేశ మందు ఫలించఁబోవు పంట యం దైదవ భాగము రైతులకడ గడించి ఆయా పట్టణంబులఁ

గోటారులగట్టించి భద్రముగావించి కఱవు యేడేండ్ల కాలంబు నందాధాన్యంబును వినియోగింపఁ దగునని యోసేపు దూర దృష్టితో విన్నవించెను. ఫరోమహారాజానందవార్ధి తరంగంబులం దుఱ్ఱూత లూఁగి యాతని విజ్ఞానమునుకుశాగ్ర బుద్ధి బలంబు నెంతో శ్లాఘించి బహుగతుల నుతించి తన వ్రేలి ముద్దుటుంగరంబును యోసేపు కెంగేల నలంకరింపఁ జేసి, సన్నపు నారబట్టలఁ దొడగించి నవరత్న ఖచిత హారంబుల ధరింపఁ జేసి, పుష్ప రథంబుపై నధిష్టింపఁ జేసి, రాష్ట్రప్రజ లందఱి చే నమస్కారములఁ జేయించి బహు విధ వాద్యఘోషలు భోరుకలంగ పట్టణ వీధులం దూరేగించి యతివైభవంబున గారవించి నీకువలె వివేక విజ్ఞానసంపదగల వాడెవడీ దేశంబున మఱొకండు లేడు. ఇఁక మీదటనీవు నా యింటిపైనను, నారాజ్యముపైనను నాధిపత్యమూని నడిపించ వలసిన బాధ్యత నీ యందు కాణించు చున్నయది. సింహాసన మధిష్ఠించు బాధ్యతయందు మాత్రమే నీకంటె గొప్ప వాడను గాని, తదితర విషయాలోచనల యందు నీకంటె యెంత మాత్రము గొప్ప వాడనుగాను. ఐగుప్తు దేశ మందంతట యే మానవుండైన నీసెలవు బొందనిదే తన కాలినైన తనచేతినైన గదల్పఁగూడదని చండశాసనంబు గావించుచున్నానని నుతించి భోగభాగ్యాది సర్వస్వమర్పించె.

పంట లతివిశేషముగా ఫలింప దొడంగె. యోసేపు నానతిఁ బొంది దేశమందు ఫలించు ధాన్యమును సమకూర్ప

నా యా పట్టణంబులం దుద్యోగుల నియమించెను. ప్రతి పట్టణంబున ధాన్యమును జాగ్రత్తగా గాపాడఁగల యుగ్రాణంబులఁ గట్టించెను. కాటకముచే దేశము నాశనము గాకుండునట్టి సదుపాయంబుల నెన్నోగావించెను. సముద్రపు టిసుక దిన్నెల వలె ధాన్యము కుప్ప తెప్పలుగ పండుచుండెను. తుదకు ధాన్యరాసులను భద్రముగావింప గొటారులు చాలక పోయె.

అప్పటికి యోసేపునకు ముప్పది యేండ్లునిండు జవ్వనము పొంగులు వారుచుండెను.

ఫరో మహారాజతనికి 'జప్నత్పనేహు' అను పేరు బెట్టి, 'ఓను' యాజకుఁడైన 'పోతీపెర' యనువాని తనూజయగు 'ఆసెనతు'నిచ్చి నతివైభవంబున వివాహ మహోత్సవము గావించెను.

అంత కొంతకాలంబునకు యోసేపు 'ఆసెనతు' యందు మనష్షే, ఎఫ్రాయిములను నిరుపమాన రత్నంబుల గని దేశాధిపత్యమూని, సకల సౌభాగ్యము రాశిని వరింప దైవాశీర్వచన పరంపరలంది, తద్దేశ సంచారంబు గావించుచు, బాగోగుల బరిశీలించుచు, ఫరోమహారాజు నానతి జవదాటని వినమ్రభావంబున రాజ్యరథంబును నడుపుచుఁ బాలింపఁదొడంగె.

పంటలుపుష్కలముగ ఫలించుచున్న నేడేండ్లు దాటిపోయెను. భయంకర క్షామ రాక్షసులు ప్రకృతి సౌందర్యవినోదంబుల

గబళించి వదనగహ్వారంబుల దెఱచి నాల్కల జాచి రక్తంబు గ్రక్కుచు హాహారాహారిగాఁ బోరదొడంగె. సంకటంబులు సందుఁగొనియె, సారవంతంబులగు క్షేత్రంబులు మరు భూములుగ బరిణమించె. జీమూత సంచార రాహిత్యమై ఆకాశరామ, శ్వేతవస్త్రంబు ధరించె. క్షామ చిహ్నము లంకురించె. ఆహార సమస్యా విధానంబు మానవ ప్రపంచం బును తల్లడింప జేయసాగె. రక్తమోడ్చి నను చేఁరెడు గింజలు లభింపకుండె. ప్రేగులు కాటుక బట్టి మానవ లోకంబు మలమల మాడుచుండె. కడుపు మంట పొగల సెగల దుమారంబు లెల్లెడల గ్రమ్ముకొనె. కఱవు దేశంబును బాధింపఁ దొడంగె. దేశ ప్రజ లాహార పదార్థాభిలాషలుగలై యోసేపు మహనీయునితో విన్నవించు కొనుచుండిరి.

యోసేపు కారుణ్య మానసుండగుటచే ధాన్యమును దాచియుంచిన కొటారులను విప్పించెను. బీద సాదులను భేదంబు లేకయే సర్వ జనులకు సమభావంబున ధాన్యమిప్పించుచుండె. కలవరపాటులేని విధంబున పాలనంబుగావించుచు దేశంబును సుభిక్షితముగ బోషింపఁదొడంగె. కాని ఆ కఱవు భారమన్ని దేశంబుల పైకి లంఘించి తారుమారు గావించుచుండె. ఐగుప్తు దేశమందు దక్క మఱే దేశంబున ధాన్యము లభింపకుండె. అక్కారణంబున విదేశీయు లెందరో యోసేపు మహనీయు నాశ్రయించి కష్టసుఖంబుల విన్నవించు కొని ధాన్యమార్జించి కచ్చడంబుల లొట్టియల పై దోలుకొని పోవుచుండిరి.

ఆ దుర్భిక్ష క్షామము ఐగుప్తదేశమందే గాక అన్ని దేశములతో పాటు 'కనాను' యందుగూడ వ్యాపించెను. యాకోబు కుటుంబ మన్నపానాదుల కల్లాడ దొడంగె. పుత్ర పౌత్రాదు లనేక విధంబుల కూటికై కుములిపోఁ జొచ్చిరి. తత్సమయంబున జనకుండు కుమారుల నవలోకించి కుమారులారా! మీరెందుకు భార్యాపుత్రులతో బరితపించుట! ఐగుప్తుదేశ మందు ధాన్యము పుష్కలముగా నున్నదనియు, కోరిన వారికి కోరినంత యొసంగు చున్నారనియు విన్నాడను. మీరు శీఘ్రమునే ఆ ద్దేశంబున కరగి వలయు ధాన్యంబు గొని వచ్చుట శ్రేయస్కరము. అని ప్రయాణము గావించి వలయు ద్రవ్యం బొసంగి పుత్తెంచెను. కాని జనకుండు కుమారుల నమ్మజాలక యోసేపు తోబుట్టువగు బెన్యామీనును వారి వెంటఁ బంప సాహసింపఁ కుండెను.

జనకు నాజ్ఞ శిరసావహించి కంచరగాడిదల దోలుకొని పదిమంది సోదరులు పయనమై దుర్గమాటవుల నిర్గమించుచు, నసుకుసురై ఐగుప్తుదేశంబునకు జేరిరి. తద్దేశాధికారియై సమస్తము నేలుచు మహిమా ప్రభావంబులచే విఱ్ఱవీఁగు యోసేపు నవలోకించి వినమ్రభావంబుల సూచించి ముఖంబుల నేలవంచి, భక్తి నిబద్ధాంజలులై యొక్కుమ్మడి సోదరులందరు వంగి నమస్కరించిరి. హఠాత్తుగా సోదరుల నందఱు దెలియని రీతిగా గాంచిన యోసేపు హృదయ సంతోషసము రంభములకు మేరలు లేక పోయెను.

పొంగివచ్చు దుఃఖపరితాప భారంబుల గప్పిపుచ్చి యన్యునివలె నటించుచు మున్ను తాఁగనిన కలల దలంచుచు, మీరెవరు? మీ దేశ మెద్ది? ఇందుల కేకతంబున వచ్చితిరి? అని బిగ్గరగ పరునివలె రక్తాక్షి మానంబును గప్పి పుచ్చి ప్రశ్నించుచు, వేగుల వారివలె బొడగట్టు చున్నారు. ఈ దేశము యొక్క గుట్టుమట్లు దెలిసికొనుటకై వచ్చినటుల గాన్పించు చున్నారు. గానిచో నిందఱెందుల కొక్కుమ్మడిగా వచ్చుటకు తలస్థించు! అని భయంకరంబుగ గద్దించిమాటాడెను. సహోదరు లందరు కన్నీ రొలుకుచు, ప్రభువా! మా జన్మస్థానము కనాను. మేమందఱ మొక్క పురుషుని కుమారులము. మా దేశంబున ప్రచండమైన క్షామము వ్యాప్తించుటచేనిట నాహారపదార్థంబులమ్ముచున్నారని వినికొనుటకు వచ్చినారము. యదార్థమును బాలించు వారలమే గాని గూఢచారులముగాము. పండ్రెండుమంది కుమారుల యొక్క జనకుని కడుపున జనియించితిమి. మా జనకుని నామంబు యాకోబు, భగవద్భక్తి పరాయణుండు. కనిష్ఠసోదరుండు జనకుని వద్ద నున్నాడు. యోసేపను సోదరుం డెప్పుడో తప్పించుకొని పోయినాడు, మహాత్మా! ఇయ్యది మాసత్య సమాచారగాథ. అని భక్తివిశ్వాస వినమ్ర భావంబుల రేకెత్తించివచించిరి. అంత యోసేపుకనిష్ఠ సోదరుం డొక్కరుండింటి యొద్దనున్నాడని జెప్పుచుంటిరి. మీయందొక్కరుండు గృహంబున కేగి వానినిచ్చోటకు గొని వచ్చు నంతకు మిమ్ము

నమ్ముటకవకాశముండదు. వాసిచ్చుటకు వచ్చువఱకు మీరు చెరసాలయందుబంధింపబడుదురనిదద్రీతిఁ జెప్పచుగావించెను.

ఆకారణమున వీరల చెరసాల బంధించితి. ఇంటియొద్ద తలి తండ్రు లన్న పానీయముల కెంత యిబ్బంది పడుచుందురో, యని జాలిపడి యోసేపుఁ డన్నల నారసి మీరందరీ చెర సాల యందుండఁగ లార్చుట పాడిగాదు. మీయందొక్కరుండు మాత్ర మిందు బంధింపఁ బడవలెను మిగిలినవారు ధాన్యము దోలుకొని గృహంబుల కఱిగి కఱవుఁ దీర్చుకొని మఱల వచ్చునపు డింటియొద్దనున్న బెన్యామీనును వెంటఁ గొని రండు. అప్పుడు మిమ్ము నమ్ముట కవకాశముగల్గును. లేదా మీరు నిక్కువముగ వేగులవారలగ పరిగణింప బడుదురు! అని గంభీరోక్తులనాడి చెరనుండి తప్పించె. దుఃఖాక్రాంత స్వాంతులునై సహోదరు లందరు అయ్యో. నాఁడు మన సహోదరుండగు యోసేపు యెడల గావించిన నపరాధ పరాభవంబు లీరీతి మనల శిక్షలపాలు గావించెను. మనలబతి మాలుకొని నప్పుడాతని ప్రార్థన మంగీకరించితిమా? నిరపరాధుఁడగు నాతని మొఱాలకించితిమా? గోతిలోనుండి యన్నలారా? కరుణించి నాతప్పిదముల క్షమించి క్షుద్బాధమాన్పుఁ డని నెలుగెత్తి యేడ్చుచు నెత్తిన జేయిపెట్టుకొని ఘోషించినను వాని దీనాలాపంబుల నాలకించితిమా? అని యొకరొకరనుకొనుచు వాపోవఁ దొడంగిరి. “ఈ చిన్నవానియెడ పాతక మాచరింపకుఁడు. మనకేమి కీడు చేసినాడనిబతిమాల

లేదా! నాఁటి నామాటల వినరైతిరి. ప్రశాంత తేజో విరాజ మానమూర్తియగు యోసేపు రక్తాపరాధమే మనల నీరీతి బాధించుచున్నదని రూబేను పరితపించుచు నొచ్చుకొనుచు. మాటాడఁదొడంగె". ఉభయభాషాప్రవీణుండగు యోసేపు తత్సమయంబున వారల సముఖమందుండెను, గాని వానికి వారి భాస రాదనుకొనిరి. వారల కీసంభాషణవాగ్వాదంబు జరుగుచుండు నవసరంబున పొరలివచ్చు దుఃఖంబుఁ దెరల నాఁపజాలని యోసేపు కదికరిగి బోరుబోరున నేడ్చి తత్తాపంబు నాపుకొని మరలవారల సముఖమునకు వచ్చియెఱుగనివానివలె నటించుచు గోనెలకు గింజలు కొలిపించెను. ఎవరి గోనెలో వారివారి రూకలుంచి మూటలు గట్టించెను. ప్రయాణము కొఱకు భోజన పదార్థంబులఁ తయారు జేయించి యిప్పించెను. మీఁదట యోసేపు ననుజ్ఞఁబొంది షిమ్యోనును కారాగృహమందుంచి సోదరులు కనాను దేశమునకు బైనమై వెడలుచుండిరి.

కొంత దవ్వరిగి యొక స్థలంబున మజిలీజేసి గాడిదలపై బరువులదింపి, మేతబెట్టి చల్ది భుజించుచుండు నంత సోదరులందొక్కరుండు తన మూట విప్పిచూడగా విక్రయంబునకు గోలుపోయిన రూక లందుఁగన్నబడెను. వెంటనే నేతద్విషయంబు సోదరులకు విన్నవించె. గుండెలు బ్రద్దలై గడగడలాడుచు నిదేమి చిత్రము? రూక లిందెందుల కున్నయవి? ఇయ్యది ఎవని పంపకము. అని విచారించుచు దిక్కుతోచక యేమికీడు వాటిల్లునో యనుకొనుచు, బువ్వతిని తినకయే

రాభసంబులపై ధాన్యంపు సంచుల నెక్కించి కనాను దేశం బున కరుదెంచిరి.

సంతోష కుశల ప్రశ్నంబుల జనకుండు గావించె: పిమ్మట కుమారులై గుప్తులో జరిగిన యావద్విషయంబులుజనకునితో విన్నవించి మీరు వేగులవారని మాతో వాదించెను. అటుల గాని-చో మరల వచ్చినపుడు మీ తమ్ముండగు బెన్యామీనును వెంటఁగొని రావలయునని చండశాసనంబు గావించె. మరల వచ్చెదరో రారో యను నమ్మకముచే షిమ్యోను వానికడనే యుంచుకొనెను. వేగులువారుగాక యదార్థవంతులరేయైన నీ దేశమం దపారవ్యాపారంబుల జేసికొని యధికలాభప్రాప్తి బొందవచ్చునని వక్కాణించె. మీఁదట వారివారిగోతాలవిప్పి కుమ్మరించుసరి కెవరిధనము వారిగోతమందే గానఁబడెను. కుమారవర్గముతో జనకుండెంతయో భయపడెను. తద్ద్రవ్యంబు జాగ్రతగా ముల్లెలగట్టి కారణంబు లెటుబోయి యెటు వచ్చునో యని విచారింపఁ దొడంగిరి.

కొనివచ్చిన ధాన్యము గొన్నాళ్ళకు కడ ముట్టవచ్చెను. మఱలప్రయాణ సన్నాహంబులు గావించిరి. బెన్యామీనును తమవెంటఁ బంపుమని కుమారులు జనకుని బ్రార్థించిరి. అందులకు సమ్మతింపక; యోసేపు నడవుల బాలుజేసి. షిమ్యోనును కూలార్చి చివరకు బెన్యామీనును గూడ నాకండ్ల ముందఱ నుండనీయక యీ పన్నాగంబుల బన్ని కొనివచ్చితిరా? కొనప్రాణములతో బరితపించు నాశరీర

మీనాఁడె శ్మశాన భూముల దాచవలసి వచ్చినది. మీతంతులన్నియు నాకు ప్రతిబంధకములుగాఁ బరిణమించుచున్నయవి. ఇఁకనమ్మిమీవెంట బెన్యామీనును నంపఁజాలనని గట్టిగ వాదింపఁదొడంగె. అందులకు రూబేను, జనకా, బెన్యామీనును ప్రాణములతోఁ గొనివచ్చి నీకుజూపింపలేనిచో నాయిరువురు కుమారులను నీకు జంపసమర్పించెదను. కాన నాపలుకుల విలువగ్రహించి యనుమాన రాహిత్యుండవై నాకప్పగించిన చీమకాలంత ముప్పువాటిల్ల నీయని క్షేమంబున తిరిగి నీకడకు జేర్చెద. ఏమాత్రము ద్రోహము గావింప నేరము. ఈ చిన్న వానిని గొంపోవనిచో మాకింక బ్రతుకులు లేవు. మేము మాబిడ్డల మన్నమోయనుచు నలమటించుచు మరణింప వలసినదే! నామనవి నాలకించి పంపుమని ప్రార్థించుట తండ్రి మెత్తబడి, అకటా! యోసేపు లేడు. బెన్యామీనును కూడ నాయొద్దనుండి గొంపోయిన బుత్ర వియోగ సంజనిత దుఃఖానలంబున మ్రగ్గి కన్నీటితో వృద్ధాప్యంబున నెఱసిన వెండ్రుకలతో సమాధి శయ్యాల బరుండ వలసినదే; నన్ను బాధింప యత్నింపకుడు. మఱొక సహోదరుఁడున్నాడని వానితో నెందులకు జెప్పితిరి. నాకడుపుఁ గాల్చనా! అని మొండివాదనకు తారసిల్లుటగాంచి, మీతండ్రి యింక సజీవుడై యున్నాడా? మీబంధువులెల్లరు కుశలముగనున్నారా.

యని గ్రుచ్చిగ్రుచ్చి ప్రశ్నింపఁదట్టుకోఁజాలక తప్పనిసరియగుట జెప్ప నంకించితిమి. అంత యూదా! జనకా!

మమ్మింతులకు శ్రమ బెట్టెదవు. అనుమానింపక నావెంట బంపుము. క్షేమముగా నిల్లుజేర్చెద. అతడెట్టి దుఃస్థితిననుభవించిన, నా యపరాధ పరాభవము తఱతఱముల వఱకే ననుభవించెద. తడవుజేయక నావెంటఁ బంపుమని గోఁజాఱ దొడంగెను. జనకుని మనస్సు వెన్నవలెఁ గఱగి నీరై పోయె. తుదకు వారి ప్రార్థ నంగీకరించి పంపుటకొడంబడి ప్రశస్తమైన మస్తకి, తేనె, బోళము, సుగంధద్రవ్యముల, పిస్తాచకాయల,, బాదముకాయల గొనిపోయి కానుకగా నేలికకు సమర్పింపుడు. పొరబాటున గోతాలయందుంచబడిన రూకలను మరల చెల్లింపుఁడని బెన్యామీనుతోఁ బ్రయాణముసేసి సర్వశక్తుఁడైన పరమేశ్వరుండు మిమ్ముఁగరుణించుఁగాత. మిమ్ముందర నొకతూరి మరల కనులారఁ గాంచెదగాక! పుత్రహీనుండనై యుండవలసిన కాలమువచ్చిన నెవరు దప్పింపగలరు? దైవతత్వంబు లెవరు గ్రహింపఁగలరు? మిట్టను పల్లముగాను; పల్లమును మిట్టగాను క్షణములో జేయగలవాడు భగవంతుఁడొక్కడే! అయ్యాదిమానవున కసాధ్యము? ఎవరిగతులెట్లు తెల్లవారునో యెవరు గ్రహింపఁగలరు? కాని మీరు కడుమెలఁకువతో నైగుప్తదేశముఁజేరి వానికీచిన్నవానిని జూపించి పూర్వపు విక్రయ ధనంబును, జెల్లించి, వెంటనే రండు పొండని దీవించి సాగనంపె.

సోదరు లందరొక్కుమ్మడి పైనమై ఐగుప్తుజేరిరి. భక్తిభావంబున గొంపోయిన కానుకలను పొరబడిన మూల్యంబును, బెన్యామీనునుగొని యోసేపు మహనీయుని దర్శించిరి.

పరమానంద భరిత మానసుండై యోసేపు గృహ నిర్వాహకుని నవలోకించి, యీమనుష్యు లీపూట భోజనమునకు నావెంట వచ్చెదరు. రుచిగల ప్రశస్త పదార్థంబుల సిద్ధము జేయించుమని సెలవొసంగెను. యోసేపు నానతిం గొని వారల నింటికి గొంపోయి కమ్మని రుచిగల పదార్థంబులం దయారు జేయించెను. సోదరులెంతో భయభ్రాంతులైరి. మఱచిపోయిన రూకలవిషయము శిక్షించి గాడిదల వారి స్వాధీనము గావించుకొనం గాం బోలీయెత్తని యొకరొకరను కొనుచుండిరి.

గృహ నిర్వాహకుని సమీపించి, అయ్యా! మొదట మే మాహారపదార్థంబుల గోతాల నింపుకొని విక్రయ ధనంబు జెల్లించి మా దేశ మేగుదెంచుచు, మధ్యమార్గంబున చల్దిభుజించుటకై యొకసంకేత స్థలంబున మజిలీం జేసి గోతాల విప్పితిమి. చెల్లించిన విక్రయధనంబు మాకడనే యుండెను. ఆమాయామేయ పరివర్తన మెవరివలన గలిగినదో తట్టినదిగాక మీసొమ్ము మీకడకే గొనివచ్చి నారము. నిజమున కయ్యది మావలన గలిగిన తప్పిదంబు గాదని మనవిం జేయుచున్నారము. కటాక్షించి మమ్మిా శ్రమలనుండి తప్పించ వలయును. మీమేలు మఱచిపోము. అని సవినయంబుగ విన్నవింప భయపడనవసరములేదు. మీకు క్షేమము లభించుగాత, అని దీవించి కొంత నిబ్బరము సేకూర్చునంత చెఱనున్న షిమ్యోనును విడిపించి యోసేపు యింటికి గొనిపోయి సోదరుల కప్పగించెను. అంత సోదరులు గొంపోయిన కానుకలు

కల సమర్పించి సాగిలపడి నమస్కృతు లాచరింప,వృద్ధుండై మీజనకుండు క్షేమముగా నున్నాడాయని సుతిమతి కుశల ప్రశ్నంబుల గావింప.

చిత్తము ప్రభువా! నీదాసుండైన మాజనకుండు క్షేమముగా నున్నాడని జవాబు నొసంగిరి. నాతో జెప్పిన మీసోదరుండగు బెన్యామీనుం డితడే నాయని ప్రశ్నించి పొంగి పొర్లు దుఃఖపరితాపంబు నాప జాలక, సమీపంబు గదికేగి యేడ్చియేడ్చి ముఖము గడుగుకొని మరల వారల సమీపించి మాటాడు. ఆరీతి తనదుఃఖమును తనలో తానణచుకొనుచు నాంటి వియోగదుఃఖంబు చారిత్రంబును దలపోయు చుండెను. మధ్యాహ్న వేళా ఘంటికలు మ్రోసెను. భోజనము తయారైన దని కబురువచ్చెను. కాని కనానీయులతో గలిసి ఐగుప్తీయులు భోజనము సేయరు. అది వారి కెంతో హేయము. జ్యేష్ఠుని మొదలు కనిష్ఠునివఱకు తమతమ యీడు చొప్పున భోజన పంక్తియం దాసీనులైరి. సహోదరులకు తత్కార్య రహస్యమెంతో భయద్భుతాశ్చర్య చిత్రంబుల గొలుపుచుండె. పేరుపేరు వరుసన భోజన పదార్థంబుల వడ్డించు చుండిరి. తప్పని సరియగుటచే యోసేపు తోం గలిసి విందారగించి సంతృప్తులైరి.

మీందట సేవకుని రావించి "యీమనుష్యు లెంతధాన్యము కావలయునని కోరుదురో అంతంత వారి వారి గోనెల నింపి

యెవరి సొమ్ము వారి కడనుంచి బెన్యామీనుగోత మందు తనరజత పాత్రను బెట్టి కట్టించు మని జెప్పనంత పరిచారకుండు తద్రీతిఁగావించె.

ఏలిక సెలవు గడించి పెందల కడ నిదుర మేలుకొని సహోదరులు కనానుకు సాగిపోవుచుండిరి. కొంత దవ్వరిగిన మీఁదట భటుల యందొకనిని బిలిపించి ఆదుర్మార్గులు నారజత పాత్రను గొనిపోవుచున్నారు. నీవారల సమీపించి వెంటనే తోడ్కొని రమ్మని వుత్తెంచె.

సేవకుఁడు వెంటనేవారలసమీపించిఓయీ! ఆగుడు. మీరు మాప్రభువరునితో భుజించి ఆెక్కులప్రక్కుల మెలంగి, తుదకు పానపాత్రనుగొని పోవుచున్నారు ? ఎక్కడిధర్మ మియ్యది, మేలునకు కీడునే గావించితిరి చాలుచాలు మీ మేలు. మిమ్మందఱ,గొసిరమ్మని మాయేలిక నన్ను బంపెఁనన, ఆర్యా! అట్టి దురంతకార్యము మేమాచరించి యెఱుంగము. పూర్వపు విక్రయ ద్రవ్యంబుఁ బొరపాటున మాగోనెల యందుండ మరల యేలిక కప్పగించితిమి. నీప్రభువు దివాణమందు వెండినైనను బంగారమునైనను దొంగిలించి యెఱుంగము! ఆ రజతపాత్ర మెవరి గోనెలో దొఱకునో వాడు మరణించుగాత. మేమందర మొక్కండ దాస్యబంధంబుల బంధింపఁబడుదుముగాక యనిరి. మంచిది. మీరు జెప్పినటులే గావింపుఁడు. ఎవరిగోనె యందది లభించునో వాడే మాయేలికకు దాసుఁడు కాఁగలడు. రండు పోదమను నయ్యవసరంబున.

వారాతురత మనస్కులురై వారి వారి గోనెలను గాడిద లపైనుండి దింపి మూతుల విప్పిరి. పెద్దవాని మొదలుకొని చిన్నవానివఱకు సోదావేయుగా బెన్యామీను గోతమందే రజతపాత్ర గానఁబడియె. సోదరులందఱు తదాశ్చర్యంబునకు స్తంభించిరి. మఱుమాటాడ జాలక నేత్రముల మూసికొనిరి. ఏమియుదోచక నెత్తి గొట్టుకొనుచు గోడుగోడున పెద్ద పెట్టున నేడ్వఁజొచ్చిరి. పలుమాటల వాడగు సేవకుని వటాటోపమునకు తట్టుకొనజాలక గోతాల బిగించి గాడిదలపై కెత్తి మొక్కుచు మూల్గుచు గారణంబులెట్లు పరిణమించునో యని బహువిధంబులఁ బరితపించుచు నైగుప్తు పట్టణంబు జేరి యోసేపును దర్శించి సాగిలపడి దేవరవారు మమ్మెందులకు మరల రప్పించుట, అని వినయపూర్వకంబుగ మనవిఁజేసిరి. యోసేపు సోదరుల నవలోకించి, సజ్జనులను భావంబున మిమ్మందఱ నింటజేర్చికొని యాతిథ్య మొసంగి గౌరవించి నందులకు ప్రతిఫలముగా నా రజతపాత్రను దొంగిలించుకొని పోవుచుంటిరి. నేను జ్యోతిశ్శాస్త్ర ప్రవీణుండను గాననుకొంటిరా? నాకడనా మీ మాయలమారి బూటకవృత్తులు, వేగులవారము కామనియు, దొంగలము కామనియు, బీర సాలుతీసి యిట్లాచరించుట తగునా! అనిగద్దింప సహోదరులు గన్నీరుడించుచుఁ బ్రత్యుత్తరంబొసంగ నేరని దైన్యవుం జూడ్కుల వెలార్చి నిలువంబడిరి. రజతపాత్ర మెవని గోనె యందు దొఱకునో వానినే నాదాసునిగా నెన్నుకొనెదను. అన, యూదా గడగడ వణకుచు మహాత్మా! మున్ను

వీనితోఁబుట్టు వొక్కరుండు దుష్టమృగంబులచే నిహతుండయ్యె, మీ యానతి శిరసావహించి నీ చిన్నవాని నెంతో బలవంతముగా మాజనకుని సన్నిధినుండి మీకడకు గొని వచ్చినాడను. ఆతని ప్రాణముతో నీతని ప్రాణము పెనవేసి కొనియున్నది. ఒకచో వీనినిచ్చోట వదలి మజ్జనకుని పజ్జకరిగితిమేని, తత్క్షణమే వాడు మరణించుట తప్పదు. మేమునశింపని దుఃఖంపుటగ్గి కొండల భారము నెత్తికెత్తుకొనుట దప్పదు. నాజనకుని ననివార్య పుత్రవియోగ సంజనిత దుఃఖ జ్వాలలు నన్ను పీడింపక మానవు. నీదాసుండనైన నా మొరాలకించి వీని నింటికంపిన, నీకిష్టుడ నేను పాత్రుండనగుదు. కరుణా సాంద్రుండవగు నీవీ తప్పిదంబు సైపవలయును. లేదా వీనితో నా వంశ మంతరింపవలసినదే? అని బహువిధంబుల బరితపించుచు, బిక్క మొగంబున దీనుండై మ్రాన్పడి తలగొట్టుకొనుచు, యోసేపును బ్రార్థింపఁ దొడంగె.

యోసేపునకు దుఃఖము పొరలి పొంగులు వారుచుండె. తన్నుఁ దానణచుకొనఁ జాలక దిగ్భ్రమం జెంది యసురుసరగుచుండె. హృదయావేదన ద్విగుణీకృతం బగుచుండె. సోదరుల పరితాప భారంబును, దుఃఖభీతి కాలాపంబులను వినలేక పోవుచుండెను. తుదకు తన సముఖమందున్న పరాయవారల వెలుపల కంపెను. సోదరుల నొక్కుమ్మడి గౌఁగిలించుకొని, తన్నుఁదాఁ దెలియఁ జెప్పుకొని బెద్దపెట్టున నేడ్చుచు సంతతధారగాఁ గన్నీరు గురియఁజొచ్చె. విశారదులై నిశ్చేష్టులై దిగ్భ్రమఁ జెంది సోదరులాతని సముఖమందుండి కన్నారఁ

జూచి మాటాడలేక పోయిరి. ఆతడెలుగెత్తి యేడ్చుచుండ నైగుప్తీయులును, ఫరోయింటి వారును సహింపఁ జాలక తబ్బిబ్బులైరి. యోసేపు సోదరులారా! అకారణ ద్వేషాగ్ని వర్షము గుంఫించి నిర్దోషినగు నన్ను గోతిలో వేయించి నిర్దాక్షిణ్యా భావంబున నాఁ డటవీ మధ్య ప్రదేశంబున వర్తకుల కమ్మఁబడిన యోసేపను వాడను నేనే! నన్ను విక్రయించిన దోషభారంబునకై వగవకుఁడు. అదిమీకు సంతాపముఁ బుట్టింప నీయకుఁడు. మీ ప్రాణ రక్షణార్థమై ముందుగా భగవంతుఁడీ రీతి నన్ను సిద్ధపఱచి పంపించెను. రెండు సంవత్సరములనుండి కఱవు దేశంబును బాధించుచున్న యది. సేద్యమైనను కోత యైనను లేని మరైదువర్షంబులు దేశంబును గబళింపనైయున్న యవి. తద్వర్షంబుల పీడాచారంబులు ప్రచండముగా విస్తరించి జీవుల తబ్బిబ్బుగావింపఁ బొంచుకొని యున్నయవి. ఆ కాల కము తూకమున కందగరానిబరువుగ బరిణమించును. మిమ్ము మీసంతానమును రక్షించి దేశమందు శేషముగ నిలుపుటకు ప్రాణములతో గాపాడుటకు దేవుఁడు ముందుగా నన్నిట కంపించెను. నా యెడల గావించిన నాఁటి దుర్దాంత విప్లవ దోషము మీయది గానే భావింపఁ జాలను. భగవంతుని కృపా విశేషంబులు, మహిమా ప్రభావంబు లద్వితీయములు. పర్వతరాజంబుల నణువులుగాను, నణువులబర్వతంబులుగాను నిమేషమాత్రలో గావించితల్లక్రిందులుగఁ జేయఁగలజగన్నాటకసూత్రధారి. ఆతని తత్త్వములు పరివర్తనములు, రహ

స్యములాతనికి దప్పమతేరికి గోచరింప (జాలవు. ఫరోమహా రాజునకు తండ్రినిగాను తనయింటి వారికి ప్రభువునుగాను.
నై గుప్తదేశంబున కేలికగా నియమించి మిమ్మందఱ మఱొ కతూరి నాకనులకు గనుపఱచిన దేవుని ప్రభావము వర్ణింప నలవిగాదు? అంచుభగవంతుని దివ్యలీలల స్మరించుచు, బెన్యామీనును గౌ(గిలి(చుకొని బెద్దపెట్టున నేడ్చెను. వెం టనే నాజనకుని సాన్నిధ్యమున కేగి, నీ కుమారు(డైన యోసేపు( డై గుప్తదేశంబునకు ప్రభువై జేగీయమాన ప్రభలతో నేలుచున్నాడని మనవి(జేసి, నాయొద్దకు గొని రండు, మీకుగోషెను ప్రాంతమప్పగించి యందు(గల సర్వ స్వభాగ్యంబుల స్వాధీనము గావించెద. ఇం(కరా(బోవు క్షామ సంవత్సరము లందే విపత్తు వాటిల్ల నీయక గాపాడెద. ఈ దేశంబున నాకుగల్గు మర్యాద ఘనతల జూచుచున్నారు గదా? నా సమస్త వైభావాస్పదంబుల జనకుని కెఱి(గించి వెంటనే దోడుకొని రావలయును. మీ యశస్సౌభాగ్య పరంపర లనేకరె ట్లధికము గావించెద. నాసర్వస్వము మీకు సమర్పించెద, అంచువారందర నానందభావంబున నా లింగనము గావించి యేడ్చుచుంట, సోదరులు పట్టరాని దుఃఖభారంబున నేడ్చుచు జంకుపిడి యోసేపును బెనవేసి కొని ముద్దులాడి మాటాడ దొడంగిరి.

యోసేపు యొక్క సహోదర శ్రేణివచ్చి నారని ఫరోవిని సంతోష సంభ్రమ ప్రభల వెలార్చుచు, వారల సమీపించి, మీరవశ్యమే కనానుకు వెళ్ళి కలి(గిన దంతయును గొని

జననీ జనకులను మీభార్యా పుత్రులను గొనిరండు, ఈదేశము యొక్క సారమును మీరనుభవించెదరు; దేశమందుఁ గల మేలగు వస్తు సముదాయంబులు మీకే యగును. అచ్చోటగల సమస్త భాగ్యంబులను గణింపక వెంట నేరండు. పొండని సెలవొసంగుచు వలసిన వాహనంబులఁ దయారు గావించి చద్దిబత్తెంబుల చాల చేయించి ప్రశస్త వస్త్రంబుల గట్టించి, సాగనంపె.

వెంటనే సోదరులందరు బయలుదేఱి యానంద భావంబున బొంగిపోవుచు, కనానునకు వెడలి యేతద్వార్తా విశేషంబుల జనకునితో విన్నవించిరి. జనకుఁ డానంద పారవశ్యంబున నట్టి నేలఁ గూలెను. కనుగొలంకు లానంద బాష్పసందోహంబులచేఁ దానంబులాడెను. దేహ ముప్పొంగెను. పొరలివచ్చు సంతోషంబునకు మేర లేకపోయెను. ప్రాణములు తెప్పరిలెను. భగవంతుఁడు ప్రార్థనమంగీకరించి ప్రాణంబుల వీడకముందే ముద్దులపుత్రుఁడగు యోసేపును దర్శించుకొను భాగ్యము నా కనుగ్రహించెను. ప్రతిభావంబుల గొనియాడుచు తనసమస్తమును వాహనంబులపైగొని నైగుప్తు దేశంబునకుఁ బోఁ బ్రయాణమయ్యె.

మధ్యేమార్గంబున యాకోబు మహాశీయునకు భగవంతుఁడు ప్రత్యక్షమై యాకోబూ! జన్మభూమినివీడి పరభూములకేగుదెంచుచున్నాడనను సంశయము కల్పించుకొనకసత్వరమే నైగుప్త దేశంబునకు నీసమస్తములోఁ బొమ్ము. నీ

కుటుంబమునకు వలసిన సమస్త భోగంబుల సిద్ధపఱుపనై ముందుగా యోసేపును బంపినాడను. సర్వకాల సర్వావస్థల యందుమీకు దోడై సమస్త శుభంబుల సేకూర్చెద. నీసంతానము వేయిరెట్లధికముగా వృద్ధి జెందునట్లు దీవించెద. ప్రభావసంపన్నుడవగు నేను మిమ్మందర మఱల కనాను దేశంబునకు జేర్చెద. తరతరంబుల వఱకు మీయశస్సంపద లైగుప్తులో రాణించునటుల ప్రశస్తమైన కట్టడముల గట్టించెద. మీచే తయారగు విచిత్రముల మించునవి యెవరు గావింప నేరరు, సంశయింపక సంతోష భరితుండవై ఐగుప్త కరుగుమని దీవించి సెలవొసంగి యదృశ్యుడయ్యె.

తోడనే యాకోబు సంశయింపక బయలుదేఱి యైగుప్త దేశభూముల సమీపించెను. జననీజనకులు, తోబుట్టువులు, వచ్చుచున్నారనివిని యోసేపు పట్టరాని సంబరంబున ఫరో మహారాజు నానతిబొందివూలరథంబుల, వాహనంబులమంది మార్బలముల సమకూర్చుకొని వారువీరొక సంకేత స్థానంబున కూడుకొనిరి.

తండ్రి కుమారులొక్కఁటఁ గలిసికొని యాలింగన భాగ్యమనుభ వించుచు నొకరి నొకరు కన్నార జూచు కొనిరి. దిగ్భ్రమఁజెందిరి. కన్నీరు మున్నీరుగఁ బోరుబోరున నేడ్వఁ దొడంగిరి. వారి దుఃఖ గానంబుల వినిన పక్షిసంతానంబార్తిచేఁ గన్నీరు స్రవించె. లతానికుంజంబులు సొమ్మసిల్లె. బాగోగుల విచారించుకొనుచు గొంతతడవు కాలము గడపిరి.

అందరేకమై పూలరథంబులం దాసీనులురై సంతోష పారవ శ్యంబున భగవన్నామ స్మరణ గావించుచు, సురక్షితముగ నైగుప్త దేశంబున కరిగి దేశోన్నత స్థానంబు లార్జించి మితి లేని భాగ్య భోగంబులచే నుబ్బూత లూగుచు పుత్త్రపౌత్త్రా దుల గడించి సుఖంబుండిరి.

# బ్రహ్మనాయని విజయము

పూర్వ ముత్తరభారతంబున ధరణీసతీ ప్రకోష్ఠ కంకణంబై రమా సీమంతినీ వాసంబై, జంభనాపురంబనునామాంతరంబునఁ బరగు పాలమాచా పురంబను పుటభేదనంబొండు గలదు. అందు సహస్రకరుండును సకలశాత్రవ భీకరుండును, సమస్తవైభవ తిరస్కృత వర్జన్యుండును హైహాయవంశసంజాతుండునునగు కార్తవీర్యార్జునుఁడు సర్వజనాను రంజకముగా బెక్కేండ్లు రాజ్యపాలనం బొనర్చి పానాధ్వర క్రియాభిరతుండై మార్గణగణ పరిభృత సంతానంబులకు మధుమాస వాసరంబై నిజ యశంబును దిగ్వధూరోజ పటీరపంకంబుఁ గావించి దివిసౌఖ్యంబులు చూఱఁగొన నేతెంచె. అమ్మహామహుఁదొట్టి తద్వంశపయః పారావారంబున మణులట్ల పలువురు నృపసింహు లుద్భవించిరి. అందేడవ తరంబువాఁడగు సుందర చక్రవర్తి వసుంధరా వలయంబునగల రాజనందన వందిత చరణారవిందుండై వంశపరంపరాగత ప్రాచ్యరాజ్య రమోప గూహానానందిత హృదయుండై పెక్కువర్షంబులు పాలించి రాజ్యభారంబు నిజాగ్రతనూజుండగు నలుగు భూపతికి నప్పగించి తనపూర్వులు చన్నమార్గంబునంజనియె. అలుఁగు క్ష్మాధిపుండును బితృదత్తంబగు రాజ్యమును వేకన్నుల రక్షించుకొనుచు, ప్రజానురంజకముగాఁ బాలింప దొడఁగె. వెలమకులాలంకారుండును, బాడమవంశ సంభవుండును, సురగురు నిరసించు విజ్ఞానధురీణుండును నగు దొడ్డ

నాయఁడీరాణ్మణికి సచివుండై రాజ్యకార్యముల నతినైపుణ్యముతో నిర్వహించుచుండెను.

అలుఁగు భూకాంతుండు, వీరవిద్యాదేవి, భూరమాదేవి యను నిజకాంతాద్వయంబునఁ జిరకాలము సంతానముఁ బడయక యుండెను. వీరవిద్యాదేవి పుత్రార్థినియై దొడ్డనాయని యర్ధాంగియగు శీలాంబికంగూడి వ్రతంబులు సల్పునెడ మనయిద్దఱి యందెవ్వరి కేనిఁ బుత్రోదయమయ్యెనేనిఁ బ్రథమ ఫలంబు నాయది యనియర్థించెఁ. అచిరకాలంబున శీలాంబ తానోమిన నోముల పంటయోయనన మల్లికార్జున వరప్రసాద మహిమంబునంజేసి పెద్దనయను సూనుంబడసె. ఇతఁడే పెద్దనాయఁడు, బాదరాజు, బాదన్న యను నామాంతరంబుల నొప్పుచుండు. శపథ ప్రకార మలుగుభూపతి కులగోత్రములు సరకుసేయక పెద్దన నౌరసపుత్రునిఁగా నెంచి పెంచుకొనుచు నాతని రాజకుమారార్హములగు విద్యల శిక్షితుఁ జేయుచుండెను.

పెద్దనాయఁడట్లు శుక్లపక్షపాకరు చందంబున దినదిన వివర్ధమానుఁడై బాల్యకౌమారంబు లతిక్రమించి తృతీయావస్థా ద్వారంబున నిలిచె. అంతనలుఁగు ధరాధిపుండు నిజకుమారునకు రూపయౌవన సౌందర్య సౌభాగ్యంబుల సీడగు రాచపట్టి నొర్తుఁదెచ్చి యుద్వాహంబు గావింపనెంచి పెద్దనాయని రూపంబాక పత్రికయందు వ్రాయించి, దైవజ్ఞులగు ధరామరుల రావించి వారల కాచిత్తరువొసంగి, పలయు విత్తమిచ్చి 'మత్పుత్రునకు రాకన్నియ నొకర్తు వెదకికొని

రండ'ని పంచె. ఆభూనిలింపులును జేనియావ తలలందాల్చి నానారాజ సందర్శన మాచరించుచు, బెద్దనాయని శౌర్యాది గుణసంపదల వర్ణింపఁజొచ్చిరి. కొందఱవనిపతులు పెద్దనాయని రూపరేఖల నభినందించిరి. కొందఱాతని యవక్రపరాక్రమ విధంబాకర్ణించి యానందించిరి. మఱికొందఱాతని సుగుణప్రతిపత్తికి నౌదల లూచిరి. కాని యాతనికుల గోత్రములు వినినంతనే యతఁడవర్ణుఁడగుట నెవ్వరును గన్యనీయ నియ్యకొనరైరి. ఇట్లు విఫల మనోరథులగుచు నా భూసురోత్తములు బహుదేశాటనంబు గావించి విసిగివేసరి తుదకు యామ్యపథంబునం గల చందోలను నగరంబుసొచ్చి యందొకబాడబునింట విడియ జనిరి. ఆయింటిపాఱుండు వారి యాగమనంబునకు గతంబారయ వారాతనికిఁ బెద్దనాయని వివాహవిషయమునఁ దాము పడిన పాట్లన్నియు విన్నవించిరి. అంత నావిప్రుఁడు వారలఁ గాంచి "మహనీయులారా! అవధరింపుడు. ఇచటికి సుదూరంబున గంచెర్ల నామకనగరంబొండు కలదు. తత్పురాధి నాథుఁడగు కృష్ణగంధర్వ ధరణీధవుండు మదగజ నాంబుజంబాలిత భూతలుండును వైరినృప మౌళిరత్న నీరాజిత పదనాళీక యుగ్మండును, నిత్యాధ్వరారంభ క్రియాకలాపుండునునై రాజ్యంబు సేయుచుండు. అతఁడు నానాదేశాధి పతులు తన కుంకుమలుగా నొసంగిన నితంబినీ నచయంబువలనఁ బుత్రశతంబును బుత్రికాశతంబును బడసె. అతఁడు నిజపుత్రికా పుత్రుల కుద్వాహ కార్యంబులు నిర్వర్తించెఁగాని కనిష్ఠ దుహితయగు ముక్తాల

వాంఛ తగిన వరుండు లభింపమి యవివాహితయై యున్న యది. భూధవుండును వరాన్వేషణ తత్పరుండై యున్నవాఁడు. మీసంకల్ప సంసిద్ధి కియ్యదియదనని భావించెద. కానియొక్క విశేషం బాకర్ణింపుఁడు. కాలిపుట్టువునకు బుజముపుట్టువుకన్న నిచ్చట నెచ్చటనైన గలదే. కావున మీరు పెద్దనాయని కులగోత్ర నామంబులు గోప్యముగా నుంచి మీకార్యమున తప్పక ఫలోన్ముఖ మగున"ని హితంబులు వచియించెను.

తమయుద్యమంబు సఫలీకృతమగు తెఱంగలవడినందుల కాధారుణీబృందారకులమందానందబంధురహృదయారవిందు లగుచుఁగృష్ణగంధర్వ విపులాధీశుదర్శ నోత్సుకులై కతిపయప్రయాణంబుల హుటాహుటింజని, కలుములచానకు సదనంబై త్రిదశేంద్రుపుర సౌభాగ్యంబుఁ బురుడించు కంచర్లాభిఖ్యానగరంబుఁజొచ్చి యందు ప్రాసాదగోపుర సహస్రదేదీప్యమానంబై యొప్పు రాజప్రాసాదంబునకుంజని, తమ రాకనా భూధవునకుఁ బ్రతీహారి ముఖంబునం దెలిపిరి. రాజానుమతి వారు లోపలికరిగి, నిజాప్తద్విజసామంత సచివదండనాయక పరివేష్టితుండై సుధర్మను బోలు నోలగంబున బంగరు గద్దె యనలంకరించి యున్న కృష్ణ గంధర్వ భూనాయకమౌళిం గని గంధఫల లతాంతాక్షతాద్యుపాయనంబు లర్పించి దీవించిరి. భూపతియు వారల యాశీస్సులు వడసి యుచితాసనాసీనులం గావించి మ్రొక్కి వారి రాకకుంగతంబడిగిన వారు శయంబులంగల పెద్దన చిత్తరువుఁజూపి తమ వచ్చిన కార్యంబామూ

లాగ్రంబుగ నృపునకు నివేదించిరి. శ్రోత్ర పేయంబులగునా విప్రపుంగవుల నుడుల కావరేంద్రుఁడానందావిష్ట చిత్తాబ్జుండై 'మహాత్ములారా' మకుట యుక్తంబగు శిరంబునకు సుల్లున్న వని చూడనగునే! నేఁడుమద్వంశంబును గృహంబును బరి పూతంబయ్యె. అలుగుమౌళవరునితో వియ్యమందుట కన్న నాకు వేఱొండు సౌభాగ్యము కలుఁగునే? కావున మీరు వైళంబ చని తన సూనునకు ముక్తాలవాంబనా నొప్పు మత్పుత్రికనిచ్చువా ర్తమీ తేని కెఱింగింపుఁడ'ని చెప్పివారలఁ బలుతెఱఁగులనర్చించి, జాంబూనదాంబరాభరణంబులనుత్తృ ప్తులఁ గావించి పుత్తెంచెను. తమకార్యమట్లు నేఱవేరుటకా భూనిర్జరులను మోదించుచు జంభనాపురాభిముఖులై చని తాము తెచ్చిన సందేశంబు తమ పతికి నెఱింగించిరి. కర్ణపీ యూషంబగు నావార్త నాకర్ణించి యలుగు ధరావిభుండు నిజసూనునకు దగిన రాచకన్నియ లభించినందుల కతికుది కాంకురితమనః పద్ముండగుచుఁ దద్వాహావార్తఁ బురంబు నఁజాటఁబంచి వలయు సన్నాహంబులు సేయననుజ్ఞయిచ్చెను. వివాహయత్నము లన్నియు సమాప్తములైన పిమ్మట వీర విద్యాంబిక నిజనాథుని చిత్తంబు ననుసరించి నిజతనూజుని రత్నహాటక భూషాలంకృతంబగు నొక భద్ర నాగంబుపై నెక్కించుకొని తానుగారు తమ్మతాందోళికాదోహణంబొనర్చె భుజిష్యాసంఘములు గొలువ మండలాధీశ దండనాయక సమితి తన్నంటివెంటరాఁ గంచెర్లకుంజనియె. అచటఁ గృష్ణ గంధర్వుఁడ ద్దేవిని యామెకుమారుని దగినరీతుల సన్మానించి

నిజపురంబునకుఁ దోడ్కొనిచని యొక శుభముహూర్తంబున నిజతనూజాతయగు ముక్తాంవాంబను పెద్దనాయునికిచ్చి వివాహమహోత్సవంబతి వైభవముతో నెఱపెను. వివాహానంతరము నృపుని ప్రార్థనమున నిజస్నుషాతనములఁ గంచెర్లయందుంచుట కొడంబడి కృష్ణగంధర్వ దత్తంబులగు నవీనాంబరాభరణ మాల్యాను లేపనాదిసత్కారంబులు వడసి సకల సైన్యసమేతులై మగుడ నిజధామంబున కరుదెంచెను.

అట్లు కృతోద్వాహుండై పెద్దనాయఁ డహర్నిశలు ముక్తాలవాంబికారత్యాది సుఖానుభవంబులఁ జొక్కుచు శుద్ధాంతంబుఁ బాయక యుండుటంగని సహజామాతలాతని మందుఁడనియు, శిరోచితంబులగు నశ్వారోహణాదుల నెరుంగని దమ్మఁడనియుఁ దిండికిఁ బెద్దన్నగాని నానావిధాయుధములఁ బెనంగఁ జిన్నల్లుఁడనియుఁ గొంత చందంబునఁ గాలము గడుపు వానికిఁ గన్నెనెట్లిచ్చి రనియుఁ బరిహసింపసాగిరి. ఆపోటుమాటలు ఘాటంబగుములుకులై లవాంబ చెవినాట నాబోటి మిన్న నిజనాథుంగాంచి 'నాథా! పెరవారు నిన్నుఁ బరియాచకము లాడుచుండ నేసహింపనోప. తోడియల్లుఁడం గూడి వివిధాయుధ క్రీడలం దేలుము. అట్లొనర్చుట నీకహితంబేని మజ్జనకు నాజ్ఞవడిసి మన పురంబున కరుగుదమని దీనాననయై విన్నవించెను. అట్లు పలుకు నిజాంగనా వచనంబులకు మొలక నవ్వులు మొగంబునఁ గులుకరింప నా వీరావతంసుండు 'ప్రేయసీ! నన్నవమానింప నెంచిన యీ

నృపాధముల మస్తకంబులు మదీయ నిశిత కరవాలంబున ఖండించి గాని నిను మత్పురంబునకుఁ గొనిచన. వేగిరపాటు వలదు. మద్బాహుబల సంపద నచిరకాలంబులఁ జూడఁ గలవు. కాని సర్వంబును గోప్యంబుగా నుంచవలయు నని యా లలనామణి నూరార్చెను. నిజ పరాక్రమంబట్లు నిజ కళత్రంబునకుఁ జూపనెంచి పెద్ద నాయం డొక నిశీథంబున ధనుశ్శాల కరిగి పద తాడనంబున విశంకటకవాట విపాటనంబులొనర్చి లోపలికిం జని యందుఁగల శరాసనంబుల భంగపఱచి, యేమియు నెఱుఁగని వానిచందంబున నంతఃపురంబు జొచ్చెను. అరుణోదయమున నృప జామాతలెల్లఁ దమ యాయుధముకై శరాసనశాల కరిగి శకలీభూతత్వము నొంది యున్న యమఃకవాటంబును భిన్నాభిన్నంబులై పడియున్న యాయుధములను గాంచి విస్మయ పరీత చేతస్కులైరి. ఇట్టి యమానుష కృత్యంబునకుఁ బెద్దనాయఁడే కారణభూతుఁడని కొందఱు వచించిరి. పెద్దనఁ బోలుపిఱికి యిట్టి కార్యమొనర్చుట కలలోని వార్తయని మఱికొందఱనిరి. వారిట్లాడుకొనుచుఁ బెద్దన్న కడకుం జని సంతత మంతఃపుర వాసంబనర్హంబని ప్రబోధించుచు నాతని మృగయా క్రీడకు రమ్మని యాహ్వానించిరి. ఆపలుకుల కులికి మూర్ఛితుని పగిది నటియించి లేచి యా ఖేటాశ్రమమునకు నోర్వఁజాల నని వచియించి తన్ను క్షమింప వేడుకొనెను. వారాతని వచనంబులకుఁ బరిహసించుచు మృగయా కౌతుకంబున వెడలిపోయిరి.

తోడి జామాత లట్లు చనఁగాఁ బెద్దన వారికన్న ముందు రహస్యంబుగా విపినంబున కరిగి యచటఁ గల సత్వజాలంబుల నిజసత్వంబునఁ బట్టి యొకచోఁ జేర్చి మూర్తీభవించిన యగ్నిచందంబున నొకపాషాణంబుపై నుపవిష్టుండై యుండెను. అత్తఱి వడ్డకులు వనంబు సొచ్చి మృగవేషణంబు గావింప మొదలిడిరి. గాని యెచ్చటనైన నొక్క మృగంబు వారి దృక్పథంబునఁ బడదయ్యె. వారట్లు వెదకి వేసరి తుట్టతుదకు మృగంబులు చన్న మార్గంబులు పట్టి వెదకుచుఁ బోవఁ బెద్దన్న గోచరించెను. వారాతఁ డొనర్చిన సాహస కార్యం బెఱింగి భిన్నవదనులై తమకు నొక్కొక్కరికి నొక్క మృగంబు నైన నిచ్చి పంపుమని యర్థించిరి. అందుల కాశౌర్యనిధి మందస్మిత వదనుండై 'నృపాత్మజులారా! నే నూరక మృగంబుల నీఁజాల. మీ తొడలందు తప్తలోహ ముద్రికలనైన నిడనిండు. కాదేని మీ కేశఖండనంబైనఁ గావింప నిండు. దీనికి మా రొడంబడక యెదురాడి చన నుంకించితిరేని మిమ్ముఁ గృతాంత నిశాంతంబున కంపెద నని' వచియించెను. వారా మాటలకు భయాధీన మానసులై తత్క్రియలందియభిమానంబు లరదూలి యిష్ట మృగంబులు వడసి గృహోన్ముఖులై పుర ద్వారంబుచొచ్చు నవసరంబున వంది మాగధు లాయా నృప కుమారకుల గోత్రము లెన్నుచుఁ గైవారములు చేయఁ జొచ్చిరి. అందుఁ బెద్దనాయనికిఁ బూర్వ పరిచితుండగు రాఘవభట్టు పెద్దన్న కులగోత్రంబులు పొగడిన నతని యర్ధ

వాదం బాకర్ణించి మొగములు తెలతెలఁ బోవ నిర్విణ్ణులై శ్వశురుని పాలికింజని వినమ్రులై భూపాలాగ్రణీ! ఏమని విన్నవింతుము. లవాంబ నచ్చపైన వెలమ కిచ్చి దినకర వంశంబునకుఁ గళంక మాపాదించితి. క్షత్రియుఁడవని కన్నుఁ బ్రాము పెద్దన నీ పుత్రిని వరించి వర్ణ సంకరంబు గావించె. కిం ముసిఁ ద్రుంచి ధర్మసంరక్షణం బాచరించుట మిము బోటి నృపాలురకుఁ బాడిగాదె? యని విన్నవించిరి. ఆ పలుకులు విని కృష్ణ గంధర్వుఁడు మధ్యందిన మార్తాండుని చందమున మండిపడి ఔర! ఎంతటి దారుణవార్త? మీరిఁక నను మా నింపక యా పాతకునిఁ దునుముట్టింపుఁడు పొండని యానతి చ్చిన వారలా ధరారమణునితో రాజేంద్రా! మే మాతని క్రమించింపఁ జూచుట మశక తతులు మదమత్తమాతంగం బులఁ జెనకఁ దొడరుట. అప్రతిమాన విక్రమోజ్జ్వలుండగు నాతనితోఁ బోర నమరేంద్రునకైన నగునె? కావున నాతని కపటోపాయంబులఁ గాక దోర్బలంబున నడంచుట దుష్క రంబని యుగ్గడించిరి. అందుల కాభూపతి, రాకొమరులార! వినుఁడు. గార్బల్లుఁడను గంధర్వ హయరాజ మొండు నా చెంతఁ గలదు. అద్దాని నే యాశ్వికుండును నెక్కి సవారింపఁ జాలడు. వాని నొక యినుప బోనులో నమర్చియున్నవాఁడ. రేపు మీరు ప్రయాణోన్ముఖులై యున్నయట్లు నటియించిన మిమ్ము నా చెంతకు రావించి సువర్ణాంబరాభరణంబుల మిమ్ము బహూకరించి పెద్దనాయనికా గంధర్వాజానేయంబు నర్పణంబుగా నొసంగెద. అయ్యది వెంటనె యాతనినంత మొం

దించు. అంత ముక్తాలవాంబ యగ్నిఁజొచ్చి పతిఁగూడి యమరపదంబున కరుగు. 'కులీయాన్వయం బంతటితోఁ బవిత్రమగు'నని వారల నూరార్చి పంపివైచెను.

మఱునాఁడు కృష్ణగంధర్వుఁడు దంభప్రయాణ సన్నాహులై యున్న నిజ జామాతలం బిలువంబంచి వారల నుచితగతి సత్కరించె. కనిష్ఠ జామాతయగు పెద్దనాయనిఁ గూడ రావించి యతనికి నూత్న వస్త్రంబులొసఁగి గంధర్వాశ్వంబును జూపి 'ధీనిధీ! ఔత్తరాహుల శ్వారోహణమున నిపుణులని విందు. ఇయ్యది చిన్నగుఱ్ఱమని చిన్నతోఁక దీసి నెక్క సవరించి నీ యశ్వారోహణ కౌశల మీ జాంఘవాళికిఁ బ్రకటింపుమని వచించెను. పెద్దన మారాడక దాని నధిరోహించి కశాప్రహారం బొనరింపఁ బోవునంతలో నయ్యది పవన వేగంబున నాకాశ మెటకో చనియెను. ప్రేక్షకులలో హాహాకారములుద్భవిల్లెను. అంత జననీ జనకులును భ్రాతృజనంబులును ముక్తాలవాంబను జేరి తమవంశంబున భర్తను బాసిన వనిత లేదనియు, నగ్నిఁ జొచ్చి నాథునితో స్వర్గసుఖంబులఁ జూఱలాడుమనియు నానాభంగుల నామెకు బోధించి యొడఁబఱచి యగ్నికుండంబు నొకదానిఁ ద్రవ్వించిరి. ముక్తాలవాంబయుఁ బతితో గమింప నుత్సహించి వివిధాలంకార భూషితయై వచ్చి వహ్నికుండంబు డాసి యంజలి ఘటియించి దానికిఁ బ్రదక్షిణమాచరించి యందుఱుక నుద్యుక్తయైయుండె. అంతలోఁ బెద్దనాయఁడు దుస్సాధ్యంబగు నా తురంగమమును వశముకావించుకొని మరలఁ బురాభిముఖుఁడై యేతెంచుచు నవరోధాగా

రంబునఁ జెలంగు రోదనంబు లాలించి, యందులకుఁ గారణం బూహించి యతి రయంబున నరుదెంచి వహ్నిఁ జేరనుంకించు విజాంగన నొడిసి పట్టి నిజ వాహనంబుపై నిడుకొని యామావని ప్రాణంబుల కాపాడెను. కృష్ణగంధర్వాదు లొనరించిన కుతంత్రంబులు గ్రహించి పెద్దనాయఁడు క్రుద్ధుఁడై శ్యాము రాదులతో రణకేళి యొనర్చి (సమరరంగమున) వారల సమయఁ జేసి, కందర్ప నగరంబు నేలఁగలిపెను. అనంతరము బంధుజన హృదయంబునకు దురపిల్లు నిజకళత్రంబు నాశ్వాసించి, బాంధవానీకంబుల కగ్ని సంస్కారంబు లాచరించి తన యాలిని విజయలక్ష్మిని చేకొని వాహనంబు నెక్కి పుణ్య తీర్థంబులు సేవించుచుఁ దైర్థికులకు వలయు దానములు చేయుచు నిజపురంబగు జంభవా పురంబున కరిగి సుఖం బుండె.

పెద్దనాయఁడు జన్మించిన పిమ్మట దొడ్డనాయనికిఁ బెక్కేండ్ల వరకు సంతానము లేక యుండెను. ఆ సచివుని యర్థాంగియగు శీలాంబిక సంతాన లబ్ధికై చింతించి చింతించి వెడనోము లెన్నియో నోచి తుదకుఁ గవశాద్రి దేవుని వరప్రసాదంబునం జేసి గర్భముఁ ధరించెను. నవమాసములు నిండిన తరి నా శుభాంగి యొక శుభముహూర్తంబునఁ బ్రా క్సతి భానునిఁ గన్నపగిది తేజోవిరాజియగు నొక కుమార రత్నంబును గాంచె. ఆశిశువు జన్మించిన వేళ శుభశకునము లెన్నియో పొడకట్టెను. నయనానంద సుధాయుతం బగు నాబాలునకు జననీ జనకులు బ్రహ్మనాయఁడను నభిధానం

బమరించి యల్లారు ముద్దుగఁ బెంచుకొనుచుండ నాతఁడు దినదిన ప్రవర్ధమానుఁడై తేజరిల్లుచుండె. అనంతరము శీలాంబికా గర్భపయఃపారావారంబున పేర్నీఁడు, సూర్నీఁడు, మల్నీఁడను కుమార రత్నంబులు ముగ్గు రుదయించిరి. పుత్ర చతుష్టయంబునకు యౌవన మంకురింప జననీ జనకులు బ్రహ్మనాయనికి గండుకన్నమతోఁ బుట్టువగు నైతాంబను పేర్నికి గౌరమాంబను, సూర్నికిఁ దులసీ రమాదేవిని, మల్నికి మాచాంబను గూర్చి పరిణయ మహోత్సవము జరిపిరి. అట్లు దొడ్డనాయఁడును శీలాంబయు గొడుకులు కోడండ్రు తమ్ముఁగొలుచుచుండ రాజసన్మానంబులను ప్రజాగౌరవంబును బడయుచు సుఖంబుగ నుండిరి.

అలుగు ధరావరుం డొకనాఁడు నిండోలగంబుండి, సకల పురాణేతిహాస పారంగతులును, ధర్మశాస్త్రార్థ వేత్తలును నగు భూసురోత్తములకు వినయంబునఁ బ్రణమిల్లి "మహాత్ములారా! 'రాజ్యాంతే నరకం ప్రవజేత్త'ని శాస్త్రములు ఘోషింప వినమె? తొల్లి మద్వంశ కర్తయగు కార్తవీర్యార్జునుఁడు జమదగ్ని శిరంబుఁ ద్రుంచి పితృహత్యా పాతకంబు నొడిఁగట్టుకొనియె. అతని కొలంబున జన్మించిన వారెల్లరు గోబ్రాహ్మణ హత్యాది దోషంబులొనరించి తద్వంశంబునకుఁ గళంక మాపాదించిరి. నేనును తద్వంశ సంజాతుండనగుట వారిపాపములు నన్నావరించి యున్నయవి. అట్లగుట నే నీ పాపార్ణవమును ధరించు నుపాయ మొండు నాకుఁ బ్రసాదించి పుణ్యము గట్టుకొండు. మీ రెఱుంగని శాస్త్రార్థములు

గలవె?" యని విన్నవించెను. అంత నా ధరామర పుంగవులు రాజు నుద్దేశించి "రాజేంద్రా! పాపకర్మనకుఁ జిత్త శాంతి యుండ నోపునే? కావున నుద్ధతిడక్కి వినయ మనస్కుండవయి జీర్ణ పుట్టంబులు ధరియించి బంధు జనంబులు వెంబరాఁ దీర్థ సంసేవన మాచరింపుము. దానఁ బాప విముక్తి చేకుఱు. నీ వంశంబును బరిపూతంబగున"ని యుద్బోధించిరి. ఆ విపశ్చితులాడిన హితవచనంబుల కలుగు ధరాధినాథుండెంతయు నలరి వారలకు భూరి దక్షిణ లిచ్చి సంతృప్తులఁ గావించి పంపివేసెను.

అనంతర మా భూజాని తీర్థయాత్రాచణశీలియై యందులకు వలయు సన్నాహంబులు గావింప నియమించి యొక శుభ ముహూర్తంబున నరుమ్క తైలార్ద్రవస్త్రంబులు ధరియించి, మంత్రులును, సామంతులును, దండనాయకులును, పురోహితులును దన్నంటి దాస మిత్ర కళత్ర బాంధవంబుగాఁ దీర్థయాత్రకై వెడలెను. దొడ్డనాయఁడును తత్సూనులను గాంతాజనంబులును జీడి బట్టలు దాల్చి బయలు వెడలిరి. ఇట్లరుగు భూపతి పరివార సహితంబుగాఁ దీర్థసంసేవనాశక్తుండై పుణ్యనదీ నదంబులఁ గ్రుంకులిడుచు వడదెసం గల కాశీ గయాది క్షేత్రంబులు దర్శించుచుఁ దైర్థికులకు ధన రాసులొసంగి కృతార్థుండయ్యె. తదనంతరము దక్షిణా పథంబునంగల క్షీరారామ దాక్షారామాది పుణ్యక్షేత్రంబులు దర్శించుచు నమరావతిఁ జేరెను. అచట దండువిడిసి తత్పురీ నికటంబునంగల కృష్ణాతరంగిణియందు భూవిభుండును తత్పరి

జనంబును జలకంబులాడఁ జొచ్చిరి. వారట్లా పుణ్యనదియందు స్నానమాడి బయటికి రాఁగా వారు ధరించిన యగ్నిముఖ్యతైలార్ధవస్త్రంబులు తెల్లనయ్యె. అంత వారలు విధూతకల్మషులమైతిమనియు, భవబంధములు బాసెననియు మిగుల సంతసించి యచ్చోఁ గొన్నినాళ్ళుండ నిశ్చయించుకొనిరి.

ఉత్తరదేశాధీశుం డొక్కరుండు కృష్ణాపగయం దవగాహంబొనరించుచున్నాఁడను నుదంతం బాకర్ణించి తత్ప్రదేశంబునం గల బాడలు డింఢోపటంపములుగా నేతెంచి రాజును, మంత్రులును స్నానమాడు సమయంబు కనిపెట్టి వారివలన నధిక ధనంబులు వడసి పోవుచుండిరి. ఇట్లుండ నొక్కనాఁడు బ్రహ్మనాయుండును దదనుజుండగు పేర్నిఁడును నొక్క యెడ జలకంబు సవరించుచుండ నొక్క పాఱుఁ డరుదెంచి ధనార్థియై చేయిసాఁచెను. అంత వారతనిఁ జూచి మొలకనవ్వులు మొగములఁ జెంగలింప “మహాత్మా! బ్రాహ్మణుఁడు నిటలభాగంబున భస్మమును త్రిపుండ్రమును గీలింపవలయుఁగాని గంధలేపనము గూడదుగదా! గంధమిడిన నక్షతలు ధరింపవలయును. నీవేల యట్లు ధరింపవైతివని ప్రశ్నించిరి. అంతల నా విప్రుండు” మహనీయులారా! వినుండు. ఇచటి కనతిదూరంబునఁ జందోలను నగరంబొండు గలదు. తత్పురమును ధవళశంఖుఁడను రాజు పాలించుచుండు. ఆ రేని నగరి వాకిట పిచ్చికమాష్టీలనఁబరగు నిరువురు శూరశిఖామణులు గలరు. వారు పిచ్చుకలను బెంచి పురజనులపై విడుచుచుందురు. అవి వారిలలాటంబుల నక్షతలకై పొడిచి బాధించుచుండు.

అచ్చట కంబుల నెవ్వ రేని యదలించిన వారితో నా కటిలాత్మకులు ఘోర సమరకర్తుదురు. ఈ కలవింకలకు వెఱచి బ్రాహ్మణు లక్షితలు ధరింపమానిరని విన్నవించెను. వారా బ్రాహ్మణునికి వలయు ధనంబొసంగి పంపివైచిరి. అంతలో భట్టారకుఁడు విత్తముఁగొనిచను జన్నిగట్టుం గాంచి నాయుని సమీపించి, ధవళశంఖుఁడు భర్తయనియు, దక్కిన మహీభులాతని పత్నులనియుఁదనచేని మాహాత్మ్యమును బొగడెను. ఆ మాటలాలించి బ్రహ్మనాయుఁడు! ఓయి! మాయలుగు భూపతి నిట్లాడుట తగునె? మా రాజే భూభర్తలకు భర్తయయ్యెనేని నిరూపింపుమని చెప్పి, యొక ఖనిత్రంబాతని కంఠంబునకుఁ జెవ్వైచి 'దీనిని సవరింపుము'ని మా రాజునకు విన్నవింపు కొనుమని పంపివేసెను. ఆ వందియు రాజసభకంబునకరిగి జరిగిన విశేషంబులు ధవళశంఖునకు వినిపించి తన గళంబున వ్రేలు ఖనిత్రమును జూపెను. అద్దానిఁగాంచి రాజు విశ్చేష్టుండై 'ఓరీ! యెదిరిబలంబెఱుఁగక నీవట్లితర భూపాలకుల నవమానించుట యవివేకము గదా! నీకంఠమున నీ హారమిడిన వాఁడసహాయశూరుఁడై యుండనోపు. అట్టి వానితోఁ గయ్యము కూడదు. కావున నీవు మరల నాతని పాలి కరిగి, నన్నుఁబట్టి గను నతని చేని భర్తగను గొనియాడుము. అప్పుడా మహానీయుఁడే నీ కంఠమును గాగిలించిన ఖనిత్రమును జక్కఁజేయఁగలఁడు. ఇకార్యంబునకు మముబోటులు పూనఁగలరె? యని చెప్పిపంపి వేసెను. ఆవం

దియుఁ జని యట్లే యొనరింప బ్రహ్మనాయుఁడాతనిఁ గరుణించి. వలయు బుద్ధిగఱపి పారితోషికమిచ్చి పంపివేసెను.

అనంతరము బ్రహ్మనాయుండును బేర్నిఁడును విప్రవేషములు ధరించి నొసళ్ళ నక్షతలు గీలించి చందోలు నగరంబు జొచ్చి రాజవీధుల నరుగుచుండిరి. వారింగాంచి మాష్టులు తమపిట్టలను వదలిపెట్టఁగా నవి జివ్వునఁబోయి యాసోదరుల నిటల భాగంబులు పొడువ వారి భుజస్కంధములపై బ్రాలెను. అంతఁ బేర్నిఁడు కనలి యా విహంగములను గొనగోట మీటిన యసువులు దొఱఁగి పుడమిపైఁ ద్రెళ్లెను. తమ చటకంబులట్లు మడిసిన నామాతంగులు గాంచి కన్నుల మిడుంగురులురాల "భూసురులార! చెల్లునే మీకిట్టి యాగడములు? నిష్కారణముగా మా పిట్టలనేల యడచితిరి? పిట్టలఁ జంపువారల మట్టుపెట్ట మా కేని యానవడసితిమి. కావునఁ బందలై పాఱక మాతోఁ గయ్యంబునకుఁ గడంగుఁడ"ని వారల బలవంత పెట్టిరి. అందులకు 'మీతోడి కయ్యమునకు మీ భూధవునానఁ గైకొనక యియ్యకొనమ'ని వచించి యాగోసంగులఁ దోడ్కొని ధవళశంఖుని సభకు నరిగిరి. భూపాలుఁడు వారిఁ గాంచి 'భూసురులార! మీరెటనుండి యెటకేగెదరు? మీకీ నీచులతోఁ గలహమెట్లు సంప్రాప్తమయ్యె' నని వారలఁ బ్రశ్నించెను. అందులకు వారు 'నరవరా! మేము భవద్దర్శనోత్సుకులమై వచ్చుచుండ నీ మాతంగులు మర్యాద దక్కి తమచటకంబుల మీపైకి నుసికొల్పిననవి. మా లలాటాక్షతలు బొడువ నుంకించె. మేము వాని నదలించిన మాత్రమున నవి

విగతాసులై నేలఁ గూలె. దానిఁ గాంచి యీ నీచులు మమ్ముఁ గోరి బిలువ ధర్మసందేహ ముడుపఁ జాలినవాఁడవు నీవ కావున నిటకే తెంచితిమని యుగ్గడించిరి. రాజందులకు శాంతిక్షమాది గుణములచే నొప్పవలసిన మీరే యిట్టి జీవ హింసకుఁ బాల్పడిన నిఁక నేనేమనఁగలను? ఇట్టి యకార్య కరణంబు మీ కొల్లకుఁ దగునె?" యని మందలించెను. అందులకు నాయఁకుడు 'నృపా! జీవహింస లేకున్నఁ బ్రపంచ వర్తనంబె నడువదు. పిపీలికాది క్షుద్ర ప్రాణుల నెన్నిఁటినో మనము దినదినముఁ దెలియక చంపుటలేదా! సృష్టిస్థితి లయంబులకా స్రష్టయే కారణభూతుండు. కావుననే మేమీ కలహంకల నడచితిమ'ని ప్రత్యుత్తర మొసఁగెను. అంత నానృపతి "అట్లయినచో భయమువిగి ప్రతివచనంబులు వచి యింపక యీమాష్టులతోఁ జవ్వాకుఁ గడంగుఁడని యాన తిచ్చెను. అప్పల్కులువిని బ్రహ్మనాయఁడు' రాజా! యుద్ధం బునకుఁ బణంబు నిర్ణయింపకయే తత్కార్యంబునకు నియ్య కొనుట మాకసమ్మతము. కావున శపథ ప్రకారంబు నిర్ణం యింపు'మన ధవళశంఖుఁడు మాష్టులోడిన నాకూతును మీ రాజనకీయఁగల వాఁడ. మీరే యోడిన మీ రాచపట్టిని నాకుసమర్పింపవలయుఁ"ని పన్నిదము చఱచెను.

ఆప్రతిజ్ఞ కాసోదరులు సమ్మతించి రాజాజ్ఞ వడసి చని మాధ్యాహ్నికములు నిర్వర్తించుకొని మున్నుగుప్తంబుగానిం చిన యాయుధములు ధరించి బయలువెడలిరి. మధ్యమార్గం బునఁ బేర్నిఁడు నాయనింజూచి "ఆర్యా! పిచ్చుకపై బ్రహ్మా

స్త్రంబువలదు. ఆముక్కడి మూష్కుల యుక్కడంప నే నొక్క రుండనె చాలుదును. నన్నుఁ బంపుమ"ని విన్నవించిన నాయుం డందులకు సమ్మతించి విజయప్రాప్తికై యనుజు నాశీర్వదించెను. ఇంతలో ధవళశంఖుఁడు సమర సన్నాహములు గావించుకొని తానొక మదగజంబు నధిరోహించి రణకేళిఁ గ్రీడా కుతూహలుండై యుండె. అంత బ్రహ్మనాయుఁడును బేర్నీఁడును నర్కాగున్నుల శరణోసవర రంగమునఁ బ్రవేశించిరి. మాతంగులును నాయుధపాణులై కంటీటములు దొడిగి రణోత్సాహులై మత్తమాతంగంబుల చాడ్పునఁ గదనభూమికిఁ గదలి వచ్చి. యాసోదర ద్వితయంబును గయ్యంబునకు రండని చాలు ద్రవ్వరి. పేర్నిం డందులకు తుచ్ఛుల నడంప నిద్దఱేల? మీమ్మ నేకాదు. బలసమేతుండై వచ్చినచో మీ భూధవునిఁ గూడ ననాయాసముగా నే నొక్కరుఁడనే గెలువఁ జాలుదున'ని యాటోపంబునఁ బలుక నామాతంగులు నీల నీరదములు విద్యుల్లతను గవియుపోల్కి నా శూరావతంసునిపైఁ గదిసిరి. పేర్నీఁడును సింగఁపుఁ గొదమ మదకుంజరంబుల పైకి నుఱుకు వడువున వారిపై లంఘించి, చిటుకలో వారి యాయుధంబులు నగ్గునూచంబుగ నొనర్చి, తన నిశిత కరవాలంబున వారి శిరంబులుత్తరించి దుర్నిరీక్ష్య తేజోవిరాజియై కదనరంగమున విహరింపఁ జొచ్చెను. పంచము లట్లు పంచత్వంబు నొందుటఁ గాంచి పుడమిఱేఁడు విహ్వలుండై తనసైన్యాధిపతులఁ బురికొల్ప వారు సైన్యసమేతులై దవ్వాయ ముసిల్లు గప్పిన పగిదిఁ బేర్నీనిఁ బొదవిరి పేర్నీఁడును విజృంభించి శాత్రవ

సైన్యంబుల మార్కొని క్షీరాబ్ధి మథించు శైలము కరణి సైన్యతతులఁ గలియఁబెట్టి యరివీరుల శిరంబులు దరిగి వీర రసమూర్తియై విరాజల్లె. తనబలంబులట్లు తెగుటంగాంచి ధవళశంఖుఁడు భయపడి పురంబుసొచ్చి సింహద్వారపు గడియలు వేయించినఁ బేర్కొఁడద్దాని భేదింప నుంకింప భూకాంతుఁడు మొగంబున విన్నదనంబుదోప 'మహాత్మా! నీ లావెఱుంగక యిట్లవివేకంబుగా వర్తించితి మును నాయొనరించిన శపథప్రకారము నా తనూజాతను మీప్రభునకు నొసంగెద. క్షమియింపుమ'ని విన్నవించెను. ఆ మాటలాలించి బ్రహ్మనాయఁడు దనుజన్ముని నివారించి ధవళశంఖు నుద్దేశించి "రాజా! అట్లయిన నీ కూతునిప్పుడె కొనితెమ్మ"ని పలికెను. అందులకా నృపుఁడయ్యది దుర్ముహూర్తమనియు, శుభముహూర్తమునఁ దప్పక నొసఁగి యలుగురాజున కుద్వాహము గావింతు ననియు నూఱడిలఁ బలికి వారిని వీడ్కొలిపెను. వారును సత్వరగతిఁ దమ మేలికపాలి కరుగుదెంచి జరిగిన వృత్తాంతంబు సర్వంబుఁ బూసగ్రుచ్చినయట్లు వాక్రుచ్చిన, నలుగుభూపతియు మిగుల సంతసించి, వారిఁ బెక్కుభంగుల నభినుతించెను. ఒక శుభముహూర్తంబున నలుగు భూకాంతుఁడు సపరివారంబుగఁ బెండిలికై తరలి చందోలునకుఁ బోవ ధవళశంఖుఁ డెదురేగి యాతనిఁ దోడ్కొని చని వివిధసత్కారంబులఁ బూజించెను. అనంతర మొకశుభలగ్నమున నాతేనికిఁ దనదుహితయగు మైలాంబ నొసఁగి మిగుల వైభవముతో వివాహ కార్యము నెఱపి పల్నాటి

వరణంబుగా నొసఁగి సన్మానించెను. అల్లు వివాహమాడి యలుగు నరేంద్రుఁడు శ్వశురగృహంబునఁ గొంతకాల ముండెను. పిమ్మట సాగర స్నానముసేయఁగోరి యానరపతి మంత్రి పురోహితులను, చతురంగబలంబులను, నంతఃపుర కాంతాజనంబులను వెంటనిడుకొని చని తత్ప్రాంతంబునఁ బటకుటీరంబులు నిలిపి, పుణ్యదినంబుల స్నానాది కృత్యములు దీర్చుకొనుచు హాయిగాఁ గొన్ని దినంబు లట గడిపెను. భూపతి డంకు విడిసినచోట దొడ్డనాయని పేర నాయనిపల్లె యనియు, నీలాంబర పేర జీరాల అనియు, బేర్ని పేరఁ బేరాల యనియు మూఁడు గ్రామములు నిర్మింపఁబడియె. పిమ్మట నారాజచంద్రుఁ డెల్లమంచికొండపై నధివసించు కోటీశుని దర్శించి ద్విజుల కమిత దానంబులిచ్చి సంప్రీతులఁ గావించె. అటనుండి వెడలి నిజశ్వశురునిచే వరణంబుగా వడసిన పల్నాటినిఁ జూచు వేడ్కగలవాఁడై కతిపయ దినంబుల కా విషయంబుఁ జొచ్చెను. తత్ప్రదేశంబున మాధవీ లతా సంతానంబగు నొక్కచో విడిసి యచట నొక పురంబుఁ గావించె. అదియె గురిజాల యనఁబరిగెను. పల్నాఁడు శ్వశురగృహంబునకు సమీపమునునుండుటచే నలుగురాజు మరలఁ జాలమాచాపురంబునకుఁ బోవ నిచ్చగింపక గురిజాలను రాజధానిగఁ జేసికొని పల్నాటికిఁ బ్రభువై పాలింపఁ దొడఁగెను.

కొంతకాలమున కా రాజేంద్రునకు మైలమ దేవియందు నలగామ రాజును, వీరవిద్యా దేవియందుఁ బెదమలి దేవుఁడును చినమలి దేవుఁడును బాలమలి దేవుఁడును, భూరమా

దేవిచుండు వలసింగరాజును, గట్టిపెరుమాళ్ళను ఝట్టి పెరుమాళ్ళను వను సూను లాదరించిరి.

అలుగు భూనాయకుని కొలువునందుఁ దెప్పలనాయఁడను నొకయంత్యజ వీరుఁడుండెను. అతఁడు మహా పరాక్రమ శాలియు, సుగుణ సంపత్తిగలవాఁడును నగుటచే రాజాతని మిగుల మన్నించుచుండెను. తేజోనిధికిఁ గులము ప్రధానము కాదుకదా! అది వాక్కీర్తి యర్ధాంగి యగు పెమ్మసానియొక్క శుభలక్షణమునఁ గుమారుంబోలు కుమారు నొక్కరుఁ గాంచి యతనికిఁ గన్నమనీఁడను నామకరణంబు గావించె. అతనికె కన్నమదాసను నామాంతరముకలదు. ఆబాలుఁ డను దినాభివృద్ధినొందుచుఁ జిన్ననాఁటఁగోలె రణవిద్య నభ్య సించుచు నిజజననీజనకులకుఁ బ్రమోదముఁ గూర్చుచుం డెను. బ్రహ్మనాయఁడా బాలకుని సౌశీల్యంబునకు మెచ్చు కొని యాతని కులమును బాటింపక నిజకుమారునిగఁ బరిగ్ర హించి పెంచుకొనుచుండెను. కన్నమనీఁడును బ్రహ్మనా యుని జనకునిగా భావించి, యనిలసుతుండు రఘుపుంగవునిఁ గొలిచిన చందమున నాతనియెడ భక్తితాత్పర్యములు గలిగి మెలఁగుచు సమస్త కార్యములం దాతనికిఁ గుడి భుజమై యుండెను.

దొడ్డనాయని మంత్రజ్ఞత వలనను గన్నమనీని బలపరా క్రమ సంపదవలనను శత్రుభయంబుదక్కి యలుగుభూపతి రామరాజ్యంబుగా రాజ్యమేలుచుండ జనులు సకలసుఖంబులం బడయుచుండిరి. ఇట్లుండ దొడ్డనాయండును దెప్పలనాయం

డును నొక్కనాఁడు మృగయా కౌతుకంబున ధనుర్బాణాది సాధనంబులుగొని సైన్యసమేతులై వెడలిరి. వారరణ్యంబు సొచ్చి వన్యమృగంబులఁ బెక్కింటిఁ గూల్చి యలసి సొలసి గృహాభిముఖులై వచ్చుచు నార్గగండ ఘటంగట నిర్మలాంబు పూరితంబగు నొక కాసారంబుఁ దిలకించిరి. వేఁటబడలిక నపనయించుకొన నా తటాక మనుకూలముగ నుండుటచే మృగయులచట విడిసి శీతలోదకములాని వృక్షచ్ఛాయల విశ్రమించిరి. కొంతవడికి తత్సమీప వర్తియగు నవర పణ్ణుఁడొకఁడు జలాకరంబు పొంతవిడిసిన సైన్యంబులంగని ధరాధినాథుఁడొకఁ డచ్చోటికి విచ్చేసెనని సంతసించి తన భక్తి వెల్లడింపఁ గోరినవాఁడై వాలెపు జొన్న వెన్నులుకొన్ని త్రెంచి యూచబియ్యము గావించి వానిని దొడ్డనాయనికిఁ జంద్రునకు నూలుప్రోగను చందమున నుపాయనముగా నొసంగెను. దొడ్డనాయఁడా యుపహారంబుల సంప్రీతుండై కైకొని నిజపురంబునకు వచ్చెను.

అట్లు నగరంబుసొచ్చి హాలికదత్తంబులగు నాయావనాళ బీజంబులు శుద్ధాంత కాంతాజనంబుల కుముదంబు గూర్చునని యెంచి తేని యానతి వడసి వాని నంతఃపురంబునకు నంపెను. ముగ్ధలగు నా రాచపూఁబోండ్లా విత్తనములఁ జూచి పచ్చి ముత్తియములని భ్రమించి నిద్రాహారము లుజ్జగించి వానిని హారములుగాఁ గ్రుచ్చి కంఠముల ధరింపసాగిరి. అంతటితోఁ దనివోక యామత్తకాశినులు ముత్తెపుఁ జెట్లను జూడవలయునను కుతూహలముగలవారై చెలుల ముఖంబునఁ దమవాంఛ

దొడ్డనాయనికి నివేదించిరి. దొడ్డనాయఁడందులకు దరహాసము చేసి యదెంతపనియని చెప్పి యీ చేటికలఁ బంపివేసి తత్కార్యకరణమునకై తెప్పలనాయని నియోగించెను. ఆఱువేలమంది గోసంగుల వెంటనిడుకొని తెప్పలనాయఁడు మున్ను తా నేగిన మార్గంబునఁజని యా క్షేత్రంబు సమీపించి కావలి యున్న కాఁపుబిడ్డని రెండుమూడు జొన్నకడలిమ్మని యర్థించెను. అందుల కాబాలుఁడు కోపించి 'ఓహో! చాలుచాలు ఎక్కడి బాంధవ్యమిది? ప్రభువులని గౌరవించి ప్రథమ ఫలంబులొసంగిన నేరమునన్నా వెఱలవచ్చితిరి. బాలుఁడని తలంచి కాఁబోలు పొలము పీటఁబుచ్చ నెంచితిరి. మీ సర్వసైన్యముల సమయింపుటకు మాపురవాసి యొక్కఁడే చాలును. ప్రాణములపైఁ దీపికలేని వచ్చిన బాటపట్టి పొండ'ని కసరి తిట్టెను. ఆ పలుకులు చెవులకు ములుకులుగాఁ దెప్పలనాయఁడు 'అబ్బా! రెండుమూడు కడలిచ్చిన మాయక్క అతీఱును గదా' యని కోపమడంచుకొని సాదర భావంబునఁ బల్కిన నామూర్ఖుఁడు కాఱులాడ సాగెను. ఇఁకసామంబునఁ బనిసాధింపుట దుష్కరంబని యెంచి తెప్పలనాయఁడు గోసంగులకుఁ గనుసన్న సేయ నాయాఱువేలమంది యొక్కుమ్మడి పొలముసొచ్చి ఱెక్కముక్కాడనీక యా కావలికాండ్రఁ బెడఱెక్కలు విఱిచి కట్టి మంచెలు కూలఁద్రోసి, కంచెలు చెలిగి నిలువుపైరును సమూలముగాఁ బెల్లగించి మోపులు కట్టి మోసికొని వచ్చి తమనాయకుని పాదముల యెదుటఁ

బెట్టిరి. తెప్పలనాయుఁడా మోపుల నెత్తించుకొని గురిజాల పురంబునకు వచ్చెను.

ఆర్లగొండప్రభు వీయుదంతంబు కాఁపులవలన విని కోపోద్రిక్తుండై "రాజేంద్రా! చోరునివగిది నీ విల్లు మాకాఁపుల పాలములు కొల్లగొనుట పాడియె? శౌర్యంబు గలదేని సైన్యసమేతుండవై యెత్తివచ్చి నాతోఁబోరుము. కాదేని నీచేసిన కార్యము తప్పని యొప్పుకొని నీప్రాణములు రక్షించుకొనుమ"ని ఒకకమ్మ లిఖియించి యలుగుభూపతి కంపెను. ఆ లేఖ విలోకించి భూపతి దొడ్డనాయునిఁ బిలువనంపి యుద్ధమునకు సంసిద్ధుఁడవు కమ్మని యానతిచ్చెను. సేనాన వాళిఁదాల్చి యా వీరుఁడు తెప్పలనాయుఁడు బాసటయై రాసైన్యసమేతుండై దాడివెడలి యార్లగండి సమీపమున విడిసెను ఆర్లగండిప్రభు వాసైన్యము నుపలక్షించి భయభ్రాంతుండై స్వసైన్యములు గూర్చుకొని యుద్ధమునకు సన్నద్ధుండై రాఁదొడఁగె. వచ్చుచున్న విరోధ వరూథినీ జాలంబు లవలోకించి దొడ్డనాయుఁడు తెప్పల నాయని యంత్యజ వీరులఁ బురికొల్ప వారొక్కపెట్టున శత్రు వీరులపైఁ గలిసి చిందఱ వందఱ చేయ సాగిరి. దొడ్డనాయఁడార్లగండి ప్రభు శిరంబు ఖండించి సేనానాయకుల సంహరింప నాతని బలములు చెట్టొకపిట్టయై. పిమ్మట నా కడజాతి వీరులు తమ నాయకు ననుజ్ఞవడసి శత్రుపురంబు సొచ్చి రాజప్రాసాదముఁ గొల్లలాడి మిక్కుటమగు ధనముఁ గొని తెచ్చిరి. పెద్దనాయఁడా ధనములోఁ గొంతయుచటి కాఁపులకు బుణం

బుగా నిచ్చి మిగిలినదానిని వెంటఁగొనితెచ్చి రా[illegible]కుం జని జరిగిన విశేషములు తన యేలికకుఁ జెప్పి తద్ధనమును తేవి ధనాగారమునఁ జేర్చి కృతకృత్యుఁడై నిజధామమున కేగెను.

పల్నాడు విషయంబున జిట్టగామాలపా డను కుగ్రామ మొండు గలదు. అందుఁ బొట్టి నాగిరెడ్డి యను కాఁపొక డధివసియించుచుండెను. ఆ హాలికుఁ డొక్కనాఁ డరక తోలుకొని పోవుచుండఁ దన దుక్కి పొంతనున్న యొక గురువింద పొదలో శిశురోదనము వినఁబడెను. అంత నాతఁడు బలీవర్దనంబుల నాపి యచటికిఁ బోయిచూడ నా నికుంజ మధ్యమున ముద్దులు మూటఁగట్టు నొక కసిగందు కంటఁ బడెను. అతం డనపత్యుండగుట పెన్నిధిఁ గన్న పేద చందంబున ముక్కు పచ్చలారని యా స్త్రీ శిశువు నెత్తికొని యక్కునఁ గదియించి గృహంబున కేగి తన సతికి నిచ్చెను. ఆపెయుఁ బుట్టు గొడ్రాలగుట ధన్యనైతి నని యా బాలను గైకొని కనుల కద్దుకొని మిగుల సంతసించెను. కాఁపు మరల క్షేత్రమునకుఁ బోయి దుక్కి దున్నుచుండ ధన పేటి యొక్కటి సీరాగ్రముఁ దాఁకెను. దైవవశమునఁ దనకు లభించిన యానిధానము నెవరి కంటఁ బడకుండ రాత్రివేళ నద్దాని నింటఁ జేర్చి యొకచో గుప్తంబు గావించి యెప్పటి యట్లుండెను.

భగవదనుగ్రహంబునఁ దమకుఁ దొరకిన యా బాలిక కా హాలిక దంపతులు నాగమ్మ యను నామకరణ మొనర్చి

కన్న బిడ్డకన్న నెక్కుడు గారాబముతోఁ బెంచుకొను చుండిరి. ఆ పినుగును నల్లారు ముద్దుగా ననుదినవివర్ధమాన యగుచుండెను. బాల లభించినపుడె యాకర్షకునకు విత్తము సంప్రాప్త మయ్యెను. ఆమె పెరుగుచున్న కొలఁది యాతని యింటఁ గాఁడి పంటలు తామర తంపరలు గాఁ జొచ్చెను. కతిపయ వర్షములు చన్న వెనుక నా కృషీవలుఁడు శైవము నతిక్రమించిన కూతుం జూచుకొని మురియుచుఁ దనకుఁ దనయుండైనను దనయ యైనను నీవెయే గదా యని యెంచి నాగమ్మకు విద్య చెప్పింప నారంభించెను. ఆ బాలిక కుశాగ్రబుద్ధి యగుట నచిర కాలముననే సర్వశాస్త్ర సంగ్రహణము గావించెను. అనంతర మాపె సాము, విలువిద్య, హయారోహణము మున్నగు పురుషోచిత కళల నభ్యసించెను.

ఇట్లు సమస్తవిద్యలయందు దారి తేరియున్న నిజతనూజాతకు వివాహముసేయ నెంచి నిజ బంధు వర్గమున రూపలావణ్య సంపన్నుఁడును ధనాఢ్యుఁడును నగు నొక యువకుని రావించి యొక శుభముహూర్తమును నిశ్చయించెను. తా నొకటి తలఁచిన దైవమొకటి తలచు నను చందమున నదేమి వింతయో కాని యా నాఁడె శుభలగ్నమును నిర్ణయించిన పురోహితుండును, నత్తమామలును, జుట్టములును మరణించిరి. నాగవల్లి నాఁడు నాగాంబ భర్తయు, జననీ జనకులును మృతులైరి. ఇట్లుఁదటు నొక్క పెట్టునఁ దమ్ముఁ బాసి చనినను నాయింతి సుంతయైనను వంతనొందక పుట్టిన

యింటివారిదియు మెట్టిన యింటివారిదియు నగు ధనము తన వశము గావించుకొని దానికి నాయిక యయ్యె. తత్కారణమున నామెకు నాయకురాలను నామ మన్వర్థమయ్యె.

తలవని తలంపుగాఁ దన కట్లు లభించిన విత్తముతో నాయకురాలు వ్యాపారములు సాగించి యనంత విత్తము గడించి జనులలోఁ గొంత పలుకుబడి సంపాదించెను. అంతటితోఁ దనివోక యాకాంతామణి పల్నాటి ప్రభువులతో సంబంధము నెఱపి రాజ్యమున నున్నత పదవు లలంకరింప నువ్విళ్ళూరుచుండెను. ఆమె తఱచుగా రాజ సభాభవనంబున కరుగుచుఁ దన మధురాలాపంబులను మణిమయ భూషణా ద్యుపాయనంబులను నచిర కాలముననె యలుగు భూపతిని కైవసము కావించుకొనెను. అట్లు క్రమక్రమముగా నభ్యంతరంబు సొచ్చి యచటి నారీజనంబులను, రాజ సభలందు పలుకుబడి గల రాజబంధువులను తనకు వశంవదులఁ గావించుకొనెను. అధికార వ్యామోహము గలవారు చేయని యకార్యము లెవ్వి గలవు? ఇట్లా మాయావి యందఱఁ దన యఱచేత నిడుకొని, దొడ్డనాయనిఁ దొలఁగఁ గొట్టి సర్వాధికారము తానే చేపట్ట నెంచి యా సచివోత్తముని పై నేకాంతమునఁ గొండెయము లెన్నియో యా నృపునితోఁ జెవి నిల్లుగట్టుకొని చెప్పుచుండెను. త్వరలో రాజునకును దొడ్డనాయనికి మనఃస్పర్థ లుదయించెను. ఇఁక నుద్యోగమున నుంట తగదని యా మంత్రిశేఖరుఁడు తన ద్వితీయ పుత్రుఁడగు బ్రహ్మనాయని యమాత్య పదవికి

నియోగించెను. జనకునిఁ బీడించిన యీ బూమెలాఁడి, తాను వహింప నెంచిన నిరంకుశాధికారమునకుఁ గుమారుఁ డడ్డువచ్చెను గదా యని తలంచి బ్రహ్మనాయనిపై స్పర్థ వహించి యాతనిపై లేనిపోని నేరములు కల్పించి రాజునకుఁ జెప్ప నారంభించెను. కాని రాజు బ్రహ్మనాయని సుగుణము లను, నప్రతిమాన శౌర్య సంపదను, రాజకార్యనిర్వహణ దక్షతను, మేధా సంపత్తిని, ప్రతిభావిశేషమును జక్కఁగా నెఱింగిన వాఁడగుట నాయకురాలి యుద్బోధనము లంతగాఁ బాటింపక నాయని గౌరవించుచు వచ్చెను.

కొన్ని వత్సరముల కలుగు భూనాథున కవసాన దశ ప్రాప్తించెను. అతఁడు తనకు మరణ మాసన్న మగుట యెఱిఁగి తన శయ్య యొద్దకు బ్రహ్మనాయునిఁ బిలిచి, తన మరణానంతరము రాజ్యము నలగామరాజున కొసంగు మనియు, బసికూనలగు బాలమల్దేవులఁ గను రెప్పవలె గాయుచుండు మనియుఁ జెప్పి తనువు చాలించెను. దొడ్డ నాయుండును గొన్ని దినములకు స్వర్గతి నొందెను.

అలుగు ధరావర దిననాథుఁ డస్తమించిన వెనుక బ్రహ్మ నాయుఁడు నలగామరాజును పట్టాభిషిక్తునిఁ గావించి తాను మంత్రియై యతి నిపుణముగా రాజకార్యముల నిర్వర్తింప సాగెను. నాయని వైభవోన్నతికిఁ గన్నుగుట్టి నాయకురా లాతని నెటులనైనఁ బదభ్రష్టునిఁ గావింపఁ దరుణమునకై ప్రతీక్షించుచుండెను. అట్టి యదను నవతికాలమున సిద్ధించెను.

నలగామ ధరావిభుం డొకనాఁడు సైన్య సమేతుండై మృగయార్థ మడవికిఁ బోయెను. అతఁడు జనకంటకములగు క్రూరసత్త్వములఁ బెక్కింటి నుక్కడంచి మగుడ నిజ రాజధాని కేతెంచు చుండెను. ఈ యుదంతము నాయకురాలి చెవిసోఁక నాపై రాజు వచ్చుమార్గంబు నెఱింగి విపిన మధ్యమునఁ బర్ణకుటీరములను జలిపందిళ్ళను రచియింపఁ బంచి, షడ్రసోపేతంబులగు నాహారముల సమకూర్చెను. వేఁట బడలిక నసురుసురై వచ్చు భూవిభు నాపె యాహ్వానించి, యాతని యడుగులకు మడుఁగు లొడ్డి యిష్టమృష్టాన్న సంతృప్తునిఁ గావించెను. ఆ సత్కారమునకు భూపాలుఁ డెంతయు హృష్టుండై యేదేని నొక వర మర్థింపుమని నాయకురాలి కాజ్ఞయొసంగెను. అందులకు నాయకురాలు హర్షపులకాంకితగాత్ర యగుచు నంజలి ఘటియించి "రాజోత్తమా! తమకు మాఱు నేను కొన్నిగడియలు పల్నాటి రాజ్య సింహాసన మధిష్ఠించు నటుల సెలవొసంగినఁ గృతార్థ నయ్యెదనని వేడుకొనెను. రాజందులకు వెనుదీయక యట్లే కానిమ్మని తన ముద్రికను దీసి యాపె కీయఁ బోవ నాపె తన కట్టి యధికార మిప్పుడు వలదనియు సమయము వచ్చినపుడు వేడెద ననియు సమాధానము చెప్పి రాజును తృప్తి పఱచెను. అనంతర మిరువురును నశ్వారూఢులై పురంబునకు విచ్చేసిరి.

నాయకురా లట్లా భూరమణునిఁ దన వశము కావించుకొని తత్సభకు వచ్చుచుఁ బోవుచు నుండెను. ఒక్కనాఁడు

ప్రజలు పన్నులు చెల్లించు చుండఁ గాంచి తన పంతము నెగ్గించు కొనుట కదియె యదనని యెంచి భూపాలుఁ గాంచి "రాజేంద్రా! యేలినవా రానాఁ డరణ్యంబునఁ జేసిన బాస చెల్లింపుఁడ"ని యర్థించెను. నృపుఁడు మాట దప్పని వాఁడగుట నాపె తన సింహాసనముఁ గొన్ని గడియలవర కధిష్ఠించుట కియ్యకొనెను. సింహాసనారూఢ యైన యుత్తరక్షణము ననే యాపె తన సేవకుల నంపి జనుల సర్వస్వముఁ దోఁచు కొని రండని యానతిచ్చెను. వారును నామె ముఖల నౌదలలఁ దాల్చి శీఘ్రగతిఁ నరిగి మెలఁతల మంగళసూత్రములు దక్క సమస్తము దొద్దగొని తెచ్చి యమిత ధనంబులు సింహాసనమున కుభయ పార్శ్వములయందు రాశి బోసిరి. నాయకురాలా ధనముఁ గాంచి యానంద భరితయై భూపతినిఁ బిల్చి "రాణ్మణీ! చూచితివె లెక్కకుఁ బిక్కుటిల్లు నీ ధనరాసులు? బ్రహ్మనాయఁడు వీనినెల్లఁ బ్రతి సంవత్సర మపహరించి తన యింటికిఁ జేర్చుచుండె. మీ మంత్రి పదవియందు నేనె యున్నచో నష్టైశ్వర్యములు తమ రాజ్యమునఁ గాఁపురముండవే? అబల నని శంకింపకు" మని యాతని మనస్సున కెక్కునట్లు వచియించెను. నృపతి యాపె వచనములు విశ్వసించి యప్పటినుండి యాతఁడు నాయుని జిన్న చూపు చూడ నారంభించెను. ఒప్పని యొడయనిఁ గొలుచుట యపౌరుషంబని యెంచి నాయఁడు తన మంత్రి పదవినుండి విరమించి, యార్లగండి కరిగి మున్ను నిజ జన

కుం దచటి కాఁపులకు వృద్ధి కొసఁగిన ద్రవ్యముకు రాఁబట్టు కొనుచుఁ గుటుంబ భరణము కావించు కొనుచుండెను. పిమ్మట నాయకురాలు నలగామునకు మంత్రియై, 'తేలు నకుఁ బెత్తనమిచ్చినఁ దెల్లవాఱులు గుట్టు' చందమునఁ బ్రజలను నేలకుఁ గోలకుఁ దెచ్చుచుండెను.

బ్రహ్మనాయునిఁ బదచ్యుతునిఁ గావించుటతోఁ దనివి నొందక నాయకురా లాతని సంరక్షణమున నున్న బాలమల్దేవుల నంతమొందింప నుపాయములు వెదకుచుండెను. ఆ రాకొమరు లభ్యసించు సాము మున్నగు విద్యల నాపెయె స్వయముగాఁ జూచుచు వారి ననేక విధముల సంతోష పెట్టుచు క్రమక్రమముగా వారికిఁ దనయందు విశ్వాసముఁ జనింపఁ జేసెను. అట్లా బాలకులఁ దన వశవర్తులఁ గావించు కొని వారిచేఁ బెక్కుదుండగములు చేయించుచు వానినెల్ల రహస్యముగా రాజునకుఁ జెప్పి వారిని దండింప నాతనిఁ బురికొల్పుచుండెను. కాని వా రొనర్చునవి బాల్యచేష్టితములని యెంచి రాజు వారిని మన్నించుచు వచ్చెను. తన మాట లెల్ల నీటివ్రా లగుటకుఁ జింతించి యావిసపు నెలఁత యొకనాఁడా బాలుర ధనుర్విద్యా కౌశలమును జూడఁ గోరిన యట్లు నటించి వారల రావించి రాజునకుఁ బ్రియముఁ గూర్చు నొక పతంగరాజమును గొట్టు నట్లు వారలఁ బ్రోత్సహించెను. అందగ్రజుండగు బాలదేవుఁడు వింట బాణంబు సంధించి యా ఖగమును గ్రింద బడవేసెను. తన ప్రియ విహంగ మట్లు మడయుట చూచి రాజు కోపానల

జందహ్యామానుఁ డగుచుండ నా మాయలమారి యాతనిఁ దిలకించి' రాజా! నే నెన్ని చెప్పినను నమ్మవైతిరి. ఆ పులుఁగును బిలుఁకమార్పకుఁ డని నెత్తిన నోరిడుకొని చెప్పినను నీ తమ్ములు వినరైరి. దేవరవారి యండజము నడచిన వారు మమ్ముఁబోటుల ప్రాణము లిఁక దక్కనిత్తురే యని యుగ్గడించెను. ఆమాటల కతఁ డాజ్యాహుతిఁ గొన్న యాశుశుక్షణి చందమున మఱింత మండిపడి యా రాకొమరులఁ జంప ననుజ్ఞయిచ్చెను. ఆ కుటిలాంగన తన సంకల్పమీడేఱెనని చంక లెగుర వేయుచు నా బాలకుల నొక మంజసమునఁ బెట్టించి, దహించి రండని తన భృత్యుల కాజ్ఞాపించెను.

ఆ దుష్టురాలి ప్రయత్నము లన్నియు వేయిగన్నుల నరయుచుండిన శీలాంబ యా బాలకుల రక్షించి కొనితెండని తన గూఢచారుల నంప, వా రాహంతకుల నెట్లో ప్రతారించి యాడింభకులఁ దోడ్కొని చని యా పుణ్యాంగన కప్పగించిరి. ఆ సాధ్వి వారలఁ గొంతకాలము దాఁచి యుంచి, గుట్టు బయలు వడునను భీతిచేఁ గార్యార్థ మార్లగండి కరిగిన నిజ తనూజుండగు బ్రహ్మనాయని కడకు నంపెను. అతఁడా బాలకుల యవస్థకు దురపిల్లుచు, వారిని వెంటనిడుకొని గురిజాలకు వచ్చి రహస్యముగాఁ దన మిత్రులఁ బిలిచి నాయకురాలి దుర్నయముచే భూరమణుఁ డొనరించిన దుష్కార్యమును వారికిఁ దెలిపి, యిఁక గురిజాల నుంట క్షేమంకరము కాదనియుఁ దాను బాలమద్దేవులకు నర్ధరాజ్య మిప్పించి,

కొండోక పురంబుఁ గావించి యచట మంత్రిత్వము నెఱ పెద ననియు వారికిఁ దెలిపెను. వారును మిగుల సంతసించి యతనితోఁ బోవ నిశ్చయించుకొనిరి.

మఱునాఁడు బ్రహ్మనాయఁడు బాల మల్దేవులతో నృపుని సందర్శించి, వారి కర్థరాజ్య మీ నొడఁబఱచి, వారలఁ దోడ్కొని పురజనులు వెంటనడువ నూతన పురనిర్మాణము నకై వెడలెను. వా రట్లు గురిజాలకుఁ బశ్చిమ ముఖం బుగఁ జని చంద్రవంక నదీతీరంబు జేరి మాధ్యాహ్నిక ములు దీర్చుకొన విడిసిరి. వారు దిగినచోటు పట్టణ నిర్మాణ మున కనుకూలముగా నుండుననియుఁ బాలమాచా పురంబు నకు దీటువచ్చు పురరాజ మొండు నిర్మింపు మనియు దైవ జ్ఞులగు బ్రాహ్మణులు దెల్ప బ్రహ్మనాయఁ డచట నొక నగరంబు సేసి దానికి మాచెర్లయను నామ మిడెను. అచటఁ దొలుతఁ జెన్నరాయుని కొక దేవాయతనంబు నిర్మించెను. అనంతరము రాజప్రాసాదములను, నిజమందిరంబును విపణి వీథులను గావించెను. కన్నమనీఁడు పురజనుల యాచించి కొట్టాలమెట్ట యనుచోట నొక హర్మ్యమును నిర్మించు కొనెను. అట్లు సిరులకుఁ దావలంబై తులకవు నీడగు నప్పు రంబును రాజధానిగ నొనర్చి బాలమల్దేవులకు రాజ్యము విభజించి యిచ్చి తాను మంత్రియై వైభవముతో రాజ్య తంత్రము నడుపుచుండెను.

బ్రహ్మనాయం డట్లు మాచెర్లయం దుండఁగా నాతని యర్ధాంగి యగు నైతాంబ చెన్నరాయుని వరప్రసాదంబున

నొక్క సూనునిఁ బడసెను. బ్రహ్మనాయఁడా బాలుని బాలచంద్రుఁ డను నామధేయ మమరించి యాతని జాతకము వరయ దైవజ్ఞులగు కార్తాంతికులఁ బిలువఁ బంచెను. వారాతని సభకేగి లగ్నకాల తారాబలాదులు విచారించి యేమియుఁ జెప్ప నోరాడక పరస్పరము భావ లోకనంబు నకుఁ గడంగిరి. అప్పుడు నాయఁ డున్నది యున్నట్లు సందేహింపక చెప్పుడని వచియింప వారిలోఁ జెన్నుదీక్షితుండను పాఱుఁడు "మహాసియా! డింభక జాతకము లందు నాది యందె వేసిన చేయి. చెప్పెద నాకర్ణింపుఁడు. ఈ బాలకుఁడు దుర్ముహూర్తమున జన్మించిన కతన నితని వలన స్వజన పరజన క్షయంబు వాటిల్లు. ఈ శిశువునకుఁ బదునాలుగేఁడులు చెల్లు నవసరమునఁ జెన్నరాయని ప్రతిష్ఠ మాసిపోవును. ఈతఁడు జననాశ మొనరింపఁ జనించిన ధూమకేతువు సుమీ" యని వాక్రుచ్చెను. బ్రహ్మనాయఁ డామాటలు విశ్వసించి కన్నమనీనిఁ బిలిచి "కన్నమ కుమారా! ఇనుప పెట్టె నొకదాని చేయించి బాలచంద్రు నందుంచి యద్దాని సత్వరముగ సాగరమునఁ బడవైచి రమ్మ"ని యాజ్ఞయిచ్చెను. కన్నమనీఁడు నమ్మిన బంటగుట జనకు నాజ్ఞ కడుగు దాటక యయఃపేటిక నొకదానిఁ జేయించి, బాలు నందిడుకొని దుఃఖాక్రాంతుఁడై చనుచుండెను. అతఁ డట్లు నడిచి నడిచి నరసింగపాటికని నకరకంటికిని నడుమ నిసుగు కదలక మెదలక యుండుటఁ జూచి యతఁడు మృతినొంది యుండునని యూహించి పెట్టె విప్పి

చూడ నా శిశువు కెవ్వున నరచెను. అంత నా పాపని యతం డంకమున నిడుకొని తనతోఁ దీసికొని పోయి చనుబాలు కుడిపి యాదరముతో లాలించెను. అట్టి బాలుని ముఖావ లోకనము సేయుచు సాగిపోవఁ గాళ్ళొడక యొక వృక్ష మూలమునఁ జతికిలఁబడి రోదనము చేయసాగెను.

అంతఁ జందోలునందుఁ బాపనిసారథులఁ జొక్కి యా కాదారి మాదారి దారిపట్టి గృహాభిముఖుఁ డగుచున్న పేర్నీఁడా శబ్దము నాకర్ణించి యయ్యది పిశాచరవంబుగా నూహించి యుడిదము కేల సవరించి పెడబొబ్బ లిడుచు వచ్చుచుండెను. ఆ యలికిడి విని కన్నమనీఁడును గృపా ణము ధరించి సంసిద్ధుఁడై యుండెను. పేర్నీఁడాతని డాసి రక్కసుఁ డనుకొని యాతని నురమున వేసెను. అంత నిరువురును నెక్కటి కయ్యంబునకుఁ దార్కొని శల్య భీముల పగిదిఁ బోరఁ జొచ్చిరి. ఎదిరి లొంగకుండుటఁ జూచి పేర్నీఁడు 'నీ వెవ్వఁడవురా?' యని ప్రశ్నింప నాతని పలుకు నవ్వడి యానవాలు పట్టి పేర్నీఁడని యెఱిఁగి తన నామ మెఱింగించి కన్నమనీఁ డాతని పదపద్మములపైఁ బ్రాలెను. పేర్నీఁడాతని నాదరించి, యా నడిరేయి యతఁ డచటికి వచ్చుటకుఁ గారణ మడుగ గన్నమనీఁడు బాలుని జన్మ నక్షత్ర వృత్తాంతమును నదే కాలమున బాలునితోఁ బా లుద్భవించిన బాలకుల నడవిపాలు చేయు వలయునను బ్రహ్మనాయని యాజ్ఞకు భయపడి యొక విప్రాంగనయు వెలమ వెలఁదియు, కంసాలికాంతయుఁ గులాల వనితయుఁ

చాకలిదానయు, మంగలి మగువయుఁ దమ బాలుర నూరి
బయటి యాముదపు చేనిలోఁ బడవైచిన విషయంబును
నాతఁడు పేర్నికెఱింగించెను. ఈ సమాచార మంతయు
నామూలాగ్ర మాలకించి పేర్నిఁడు శోకవార్ధి మునిఁగి
"కుమారా! నేనీ బాలునిఁ గొని చని పెంచెద. నీవు సత్వర
ముగ మాచర్ల కేగి పురము వెలుపల నేరండ వనంబున
విడువఁబడిన శిశువుల మద్గృహంబునకుఁ గొని రమ్ము. ఈ
రహస్యము మత్సహోదరుఁ డెఱుంగరాదు సుమీ" యని
చెప్పి కన్నమనీనిఁ బుత్తెంచెను. పేర్నిఁడు తన యుత్తరీయ
మును డోలికగా నమర్చి బాలు నందిడుకొని మాచర్ల జేరి
యా శిశువును దన సతియగు గౌరాంబ కప్పగించెను. కన్న
మనీఁడు కొని తెచ్చిన బాలకులఁ గూడ గౌరాంబ గారాబ
మునఁ బెంచసాగెను. ఆఱవయేఁడు రాఁగా నా బాలకు లేడు
గురు విద్యాభ్యాస మొనర్చుచు గజ తురగారోహణాది
వీరోచితకళ లభ్యసించుచు గౌరాంబ ప్రోదిసేయ బాలచం
ద్రుల వలెఁ బేర్ని యంతఃపురమున దినదినాభివృద్ధి
గాంచుచు నేకోదర భావమున విహరించు చుండిరి.

కొన్ని సంవత్సరము లిట్లు చనిన వెనుక బ్రహ్మనాయఁ
డొకనాఁడు నిజ బంధుజనములతో నిష్టగోష్ఠి నుండెను.
అప్పుడు గండు కన్నమనీఁ డచటికి నరుదెంచి భావుకుని
మన్ననలు వడసి యుచితాసనాసీనుఁడై యుండ నాతని
తనూజాత యగు మంచాల సభాసదనంబునకు వచ్చుచుం
డెను. విశ్వలతఁ గొన్న మెఱుఁగు తీవవోలె వచ్చుచున్న

యా బాలికను గన్నమనీఁడు పిలిచి బ్రుచ్చి గౌఁగిలించుకొని యెత్తి నిజాంకపాళిం జేర్చి, శిరంబు మూర్కొని "ఈ నా లావణ్యరాశి గుణరూపంబుల కీడగు వరుండెచట లభించునో! శీలమువారింట నొక్క చిన్నవాఁడుండిన వానికి నిన్నిచ్చి పెండ్లిసేసి కృతార్థుఁడ నగుదునుగదా తల్లీ"యని పలికెను. ఆ పలుకులు వినియు విననటుండే పేర్నీఁ డులికిపడి "భావుకా! ఏదీ, నీవిప్పు డాడినమాట మఱియొకసారి యాడుము చూచెద. ఆడ ధైర్యము లేదేని సభకు దోసి లొగ్గిన క్షమించి విడిచెద"నని దరహాసిత వదనుండై పలికెను. అందులకుఁ గన్నమనీఁడు 'ఓయి! నేను వెడమాట లాడువాఁడఁగాను. బ్రహ్మనాయఁడే మనకు సాక్షి. ఏదీ, మీ యింటి పిల్లవాని నిటు రప్పింపుము చూచెద. మాట దప్పిన నేనూరకుండ'నని మాఱుపల్కెను. వెంటనే పేర్నీఁడు తన శుద్ధాంతమున నున్న బాలచంద్రునిఁ గొనిరమ్మని కన్నమదాసు నంప నతఁడు సత్వరముగఁ జని గుహుండు రవికులతిలకునిఁ దెచ్చిన రీతి బాలుని సభాస్థలికిఁ దెచ్చెను. సంగడీలు వెంటరా నడతెంచు బాలునిఁగాంచి భూదర్శనార్థము నుడుగణంబులతో నేతెంచు పూర్ణేందు బింబమా? యని సభాసదులు కొనియాడ, బాలచంద్రుఁడు పినతండ్రిఁజేరి సింగపుఁగొదమ నగంబు నెక్కు కరణి నాతని దక్షిణాంకము నెక్కెను. సభాసదులు కొందఱు "నాయఁడు సత్యసంధుఁడు గదా! దుర్ముహూర్తమున జనించిన కొమరునిఁ జంప నాజ్ఞా పించితినని లోకమునకు వెల్లడించెను గదా! నేఁడీ బాలుఁ

డెటనుండి వచ్చెను! నాయఁడబద్ధమాడెనా యేమి!" యని గుజగుజలు పోవసాగిరి. నాయఁడద్దాని గ్రహించి కం డ్లెఱ్ఱజేసి కన్నమనీనిఁ జూచి "కన్నమా! ఇఁక నీ జాలి చాలించి బాలుని శీఘ్రముగాఁ గొనిపోయి శూలమున వేసి రమ్మ"ని కఠినమగు నాజ్ఞ నిచ్చెను. కన్నమనీఁడు చేతులం జోడించి "జనకా! నే నీబాలునిఁ గొనిపోవుచుండ మధ్య మార్గంబున నిర్జీవుఁడయ్యెనని తలంచి చక్కఁగఁ బరీక్షింపక నడవిలోఁ బాఱవైచితిని. తమ యనుజుం డాతనిఁ దెచ్చి పెంచియుండనోపు" అని తన మీఁది నింద తొలఁగించు కొనెను. నాయని యాజ్ఞ నెరవేర్పువాఁడై కన్నమనీఁడును భటులును బాలచంద్రుని "సర్వేశ్వరచట్టు"ను నొక ప్రదేశమునకుఁ గొంపోయి శూలమున వేయ సంసిద్ధులయ్యె ముందు వెనుకలు చూచుచుండిరి. వారిఁ గాంచి బాలచంద్రుఁడు భటులార! మీ విచారము లుడిగి నన్ను శూలమున దింపి మీ ప్రభుని చిత్తము నెఱవేర్పుఁడు. ప్రాణులకుఁ జావు తప్పదుగదా!' యని పచించెను. ఆ మాటలు విని బాలుని సంగడీలు "మా యన్నకన్న ముందు మమ్ము వధింపుడు. అతఁడు లేనిచో మా బ్రతుకు కడవిఁగాచిన వెన్నెల కాదె?" యని పలికిరి. నిర్దోషులగు వారి కట్టి శిక్ష వలదని యా బాలుర నివారించి కన్నమయు భటులును బాలచంద్రుని శూలమున వేయ సయ్యాది కఠిథాభిన్నమై నేలఁబడెను. తన ప్రయత్నమట్లు వితథమగుటచేఁ గన్నమనీఁడు బాలకుని మరలఁ దీసికొనిపోయి జరిగిన విశేషంబులు బ్రహ్మనాయని

కలిగించెను. అంతఁ బెద్దనాయఁడును సభ్యులును, నొకరి గండము లొకరి నడంపఁజాల వనియు, దైవమెట్లు తలంచిన నట్లు కార్యములు జరుగుననియుఁ బలికి మరల బాలుని సభకు రప్పించిరి. ప్రేతకాళికి నేత్రపర్వము లొనర్చుచు బాలచంద్రుఁడు మరలఁ బినతండ్రి యంకపీఠి నలంకరించెను. అప్పుడు పేర్నిఁడు గండుకన్నమనీనిఁ గాంచి "బావా! మున్ను నీవొనర్చిన బాస చెల్లించి నీ గౌరవము నిలుపుకొమ్మనెను. గండమునఁ బుట్టిన వానికిఁ గూతునిచ్చుట తగునాయని శంకించుచుఁ దప్పించుకొనఁజూచి " నే నడిగిన ధనం బొసఁగినఁ దనయ నిచ్చెదనని కుటిలముగా వచించెను. బ్రహ్మనాయఁ డందులకుఁ గించిదంకురిత హాసభాసుర ముఖారవిందుఁడై యింతియేగదా యని కాంచన నిష్కములు వలసినన్ని తూములతోఁ గొలిపించినఁ గన్నమనీఁడా ధనంబుఁ గొని యింటికేగి వివాహ సన్నాహములు కావించెను. అనంతర మొక శుభముహూర్తమున మంచాలను బాలునకిచ్చి వివాహము కావించెను. పిమ్మటఁ గండు కన్నమనీఁడు బ్రహ్మనాయని భృత్యవర్గములో నొకఁడయ్యెను.

నాయకురాలు నాయని యెడఁ బన్నిన దుస్తంత్రములన్నియు వమ్మయి పోవుచుండెను. అతఁడు గురిజాలను విడువ వలసి వచ్చినను దన ప్రతిభావిశేషముచే బాలమల్దేవుల కర్ధరాజ్య మిప్పించి యమరావతికీడగు మాచెర్లపురంబు నిర్మించి తాను మంత్రియై స్వేచ్ఛగాఁ బరిపాలన మొనరించు చుండిన కారణమున నా మాయావి కడుపు మసలిపోవుచుండెను.

ఆపె మాచెర్ల వృత్తాంతము నరయఁగోరి యేగుల యెల్లం డను నొక గురిజాలపౌరుని నచటికిఁ బంపెను. వాఁడు సాతాని వైష్ణవ వేషము ధరించి మాచెర్లపుర వీథుల భిక్షాటన మొనరించుచు తత్పురరహస్యము లరయుచుండెను. ఒకనాఁ డతఁడు ప్రమాదవశమున నాయని యంతిపురంబు చెంతకేగ శీలాంబ యాతని వాలకము జూచి గుర్తించి 'ఓరీ! దురాత్మా! నీ గూఢవేషము లిటఁ బొసఁగవు. నాయని కంటఁ బడకుండ నేగు"మని మందలించి పంపివేసెను. వాఁడట్లు పోవుచుండ నాయఁడు వాని గుర్తించి చేరఁబిలిచి గురిజాల రాచవారి యోగక్షేమంబు లడిగి వానిఁ బంపి వేసెను.

ఏగుల యెల్లఁడట్లు మాచెర్లపుర వృత్తాంత మరసి గురిజాల కరిగి నాయకురాలికిఁ దత్పుర వైభవంబు జెప్పి యా పురజనులు బ్రహ్మనాయని సంరక్షణమున మైమఱచి నిద్రింతురనియుఁ దత్కారణమునఁ దొంగలనంపి దోఁపించుట కనువుగా నుండుననియుఁ దెల్పెను. వాని వచనంబులు విని యాపె నల్లమలయందును, నెఱ్ఱమలయందును వసించు తస్కరుల రప్పించి మాచెర్లను దోఁచుకొనిరండని పంపెను. వారును బోయి చంద్రవంక ప్రాంతారణ్యంబుల నక్కి నక్కి తిరుగుచు నొకనిశీథమున రాజప్రాసాదముఁ జొచ్చి ధనాపహరణంబునకుఁ గడగిరి. ధనాగారరక్షకు లంతలోఁ బ్రబుద్ధులై భయపడి యా వార్త కన్నమనీడి కెఱిఁగించిన నతఁడు కృపాణపాణియై వని కొఱవిసిఁ ద్రిప్పిన చందమున నంతటఁ దానై

యా తస్కరుల యాయుధములు ఖండించి వారల నొకచో గుంపు గావించెను. అంతలో నచటికి వచ్చిన బ్రహ్మనాయాది శూరు లాతని శౌర్యంబును బ్రశంసించిరి. పిమ్మట బ్రహ్మనాయని యాజ్ఞ గైకొని కన్నమనీఁ డా తస్కరుల యాయుధములు కట్టలు కట్టించి వారి తలలపై నెత్తించి, కొందఱి మూపులపై జంద్రవంక యినుమున నింపిన గోతములెత్తించి, మఱికొందఱి వీఁపుల మూఁడిబోరెములు గదియించి పశుగణంబులఁ దోలుకొని పోవునట్లా యర్ధరాత్రమున నా తస్కరుల గురిజాలకుఁ దోలుకొని పోయెను. అరుణోదయమునకు ముందె యా పురముఁ జొచ్చి యా మ్రుచ్చుల నొక పశువుల దొడ్డిలోఁ బెట్టి, తాను ద్వారముకడఁ గావలియుండెను. నాయకురాలీ సమాచార మెఱిఁగి తోఁక ద్రొక్కిన భుజంగి చాడ్పున క్రోధసంరక్తలోచనయై విసవిసఁ బసుల కొట్టంబున కరిగెను. అచట రెండవ దండధరునివలె నిలువఁబడి యున్న కన్నమనీనిఁ గాంచి నిప్పులు గ్రక్కుచు నాతని దూషించెను. అందుల కతఁడు కనలి 'ఓసి! నన్ను దూషించిన నీ నాలుక మట్టగించెదను. అబల వగుట నీ ప్రాణములు దక్కించుకొంటివి. ఇఁక నీ సిగనైన ఖండింపక విడువన'ని వెంటాడెను. అంత నాయకురాలు శార్దూలముచేఁ దరుమఁబడిన కురంగి చాడ్పునఁ బరుగులు వాఱి రాజ మందిరముఁ జొచ్చి ప్రాణములు రక్షించు కొనెను.

తెక్కలిగాండ్ర ననుగమించిన కన్నమ తిరిగి రాక యాలసించిన, నాయుఁ డాతని కేదియో యుపాయము కలిగియుండ

వచ్చునని శంకించి మఱుచటి నాఁడు గురిజాలకుఁ బయనమై వచ్చుచుండెను. నాయఁడు వచ్చుచున్నాఁడని విని నలగామ రాజాతని నెదుర్కొన నేగెను. ఇంతలో నాయకురాలు నృపుని సింహపీఠికి సమీపమున నొక లోతైన గోయి త్రవ్వించి, యందు నిశితాయుధములు పాతి, దానిపైఁ బుల్ల లమర్చి మన్నుపోసి కప్పించి, యేమియు నెఱుఁగని దానివలె నుండెను.

అంత నలగామరాజు నాయనిఁ దన కొలువుకూటమునకుఁ దోడ్కొని వచ్చెను. నాయఁడు నాయకురాలి పన్నుగడను గ్రహించి, తన్నంటి వచ్చువారినిఁ దన కిరువైపుల నడువ నియమించి, తాను నాయకురాలు కప్పియుంచిన బిలోపరి భాగమున కుంభకాభ్యాస మహిమచే నడచిపోయెను. నాయకురాలికిఁ దలవంపులయ్యెను. సభ ముగిసిన వెనుక నాయఁ డా నలగామరాజుతో రాజసదనంబున కరిగి యచట నిష్ట భోజనము లారగించి సుఖముండెను. తత్సమయమున నాయకురాలు నాయనికి విష ప్రయుక్తాహారము లంపి చంప నెంచెను. గాని యామె యత్నము లన్నియు నిష్ఫలము లయ్యెను.

తన యత్నము లట్లు వమ్మగుటకు వగచి నాయకురాలు నాయని యవమానించుట కొక యుపాయ మాలోచించెను. తగరులను, డేగలను, గోడిపుంజులను దెప్పించి నడివీథిలోఁ బందెములు వేయించుచు గెలిచినవి తనవనియు నోడినవి నాయనివనియు గేకలిడుచుఁ బరిహసింపఁ జొచ్చెను.

భోజనానంతరము నాయఁడు నలగామరాజు నీక్షించి "రాజా! మీ పురము శిథిలంబయ్యెనని విని విచారించి వలయు వాలుకమును గాత్రములను దూలమును నెత్తించి మీకడకు నంపితిని. వానిఁ దిలకింతము రండని రాజును వెంట నిడుకొని దొంగలున్న పసుల దొడ్డి కడకు నేగి చోరులను జూపెను. అత్తఱిఁ బ్రాణి ద్యూత మొనర్చుచున్న నాయకురాలోడిపోయిన కుక్కుటము నొకదానిఁ గాంచి నాయఁడోడి పఱుగు వాఱుచున్నాఁడని గేలిసేయ సాగెను. నాయఁడెంత యోర్చుకొనినను వినక యాపె యట్లే చేయుచుండ నాయఁ డాపెను దాసి యట్లాడుట తగదని మందలించి మఱియొకసారి పందెమొడ్డుమని పలికెను. ఆపె యట్లే చేయ నాయని దనఁ బరగి పాఱిపోవుచున్న చరణాయుధ మెదురు తిరిగి నిలిచి నాయకురాలి కోడి నోడించెను. నాయకురాలెన్ని కృత్రవాకువుల దెచ్చినను వాని నాకోడి మర్దించెను. అప్పుడు నాయఁడు నాయకురాలినిఁ జూచి 'మగువా! ఇప్పుడేమి చెప్పెదవ'ని హాసించిన నాపె "నా కాలజ్ఞానుల నెల్ల కడతేర్చె మెచటి కేగఁగలవు! మరల నాతోఁ బందెమొడ్డుమ"ని బలవంతపెట్టెను. నాయఁ డందులకు నాలు గైదునాళ్లు వ్యవధి గోరి మాచర్లకుఁ బోయెను.

ఈలోఁగడ నాయకురాలు కుక్కుటములఁ బట్టి తెండని తన భటుల నంప వారు పల్లియలు, పట్టణములు గాలించి గాలించి నఖరాయుధములనను గుక్కుటాండములను దండోప

తండములుగాఁ దెచ్చిరి. నాయఁడును జరణాయుధములకై తన సేవకుల నంప వారు దేశమంతటను గ్రుమ్మరి యెచ్చటను నొక్క కోడి పిల్లయైనను దొరకక పోవుటచేఁ దిరిగి వచ్చి తమ ప్రభున కావార్త విన్నవించిరి. నాయఁ డేమియు దోఁపక నిజానుజుల రావించి పుంజు లభించు మార్గ మెద్దియని విచారింప సాగెను. అంతఁ బెద్దనాయఁడు మును తాను కంచర్లను భంగపఱచి పోవుచుఁ బానుగంటి సమీపమున విడిసి నపుడొక యెఱుకతేఁడు తన యొద్దకుఁ దెచ్చి చూపిన చరణాయుధము జ్ఞప్తికి రాఁగా నద్దాని వృత్తాంతము బ్రహ్మనాయనికిఁ జెప్పి యద్దానిఁ దెచ్చుటకుఁ దానపోయెదనని వచించి కన్నమనీని వెంటనిడుకొని బయలు వెడలెను. వారు పురబాహ్య ప్రదేశముననున్న యొక వృక్షచ్ఛాయను గేశవ ధ్యానము చేసికొనుచుండ నచటికి రాయవీర పరాలుఁడను నొక వీరుఁడు వచ్చెను. అతఁడు వారి ప్రయాణ కారణమడిగి చరణాయుధమును గొనివచ్చుటకుఁ దానె పోయెదనని చెప్ప వారలఁ దోడ్కొని బ్రహ్మనాయుని పాలికిఁ జని తన యభీష్ట మెఱిఁగించి యాతనిచే నొక నిశితాయుధముఁ బడసి ప్రయాణోన్ముఖుఁడై చనెను. అతఁడు కడు ప్రయాసముతోఁ బానుగల్లు చేరి యా తామ్రచూడంబును గొని తెచ్చి నాయని పాదములకడ నుంచెను.

నాయకుఁడును నాయకురాలును కుక్కుట సమరమునకుఁ దమ జనములతో గురిజాలలో సమావేశమైరి. తన పక్షమునఁ బందె మొడ్డుటకు నాయఁడు బాలగోపన్న యను

వీరుని నియోగించెను. తన పక్షమునఁ బందె మొద్దుటకు నాయకురాలిచే నియుక్తుఁడైన మువ్వాల భీముఁడను సేనాని యిట్లు వచించెను. "ఈ ద్యూతమున నాయఁ డోడెనేని యతఁడు సమస్తము విడిచి మాచెర్ల వదలి యేలేశ్వరపు రేవున కృష్ణానదిని తరించి పరదేశముల నేడేండ్లుండి పిమ్మట వచ్చి రాజ్యము నేలుకొన వలయును. నాయకురా లోడెనేని యామెయు నా విధమున చిట్టేల రేవున కృష్ణాసముత్తరణంబు గావించి వలసపోవలయును." ఈ ద్యూత నియమములు పత్రగతంబులుఁ గావించి యిరువాగుల వారును దమ సంతకములు చేసిరి.

అనంతరము మువ్వాల భీముఁడు పెరగీచి చివ్వాల బెబ్బులియను చరణాయుధమును విడిచెను. బాలగోపన్న ధక్కుణాల పురపు జెట్టి మల్లుఁడను నాయని సీఖరాయుధమును విడిచెను. చిటికలో జెట్టిమల్లుఁడు చివ్వాల బెబ్బులి నడంచెను. మువ్వాల భీముఁ డెన్ని పుంజుల నొడ్డినను నాయని కోడి వాని నెల్ల సమయింపఁ జొచ్చెను. తన కోళ్ళన్నియు నట్లు మడియుట గాంచి నాయకురాలు సత్వరముగఁ గంగవరంబను నూరి కరిగి కట్టుబోతులను గొని వచ్చెను. వారు తమ మంత్రశక్తిచే నాయుని కుక్కుటమును జంప నెంచిరి గాని కృతకృత్యులు కాకపోయిరి. చివరకు వారు తంత్రములకుఁ గడఁగి జెట్టిమల్లుని మూర్ఛిల్లునట్లు చేయగలిగిరి. కట్టుబోతులొనర్చిన యకార్యమునకు గోపన్న క్రుద్ధుఁడై యా దుర్మతుల కంఠంబు లుత్తరించి, నాయకురాలి బలంబుల

భగ్నంబు గావించి మువ్వల భీముని యమసదనమున
కంపనెంచి యాతని వెదకుచు రణభూమిఁ జరింపఁ
జొచ్చెను. అతఁడు గోచరింప కునికి స్మృతి తప్పి
పడియున్న నఖరాయుధము నొక వస్త్రమునఁ గప్పి
చంక నిడుకొని యొక వివిక్త స్థలముఁ జేరి యచట బట్ట
విప్పి చూడ నయ్యది యసువులు బాసి యుండెను. కుక్కుట
మరణంబునకు వగచుచు నతఁడు తన ప్రాణంబులను గూడఁ
దొఱఁగుట కుద్యుక్తుఁడై యుండ నెదుట మువ్వల భీముఁడు
గోచరించెను. గోపన్నను జూచి భయభ్రాంతుఁడై మువ్వల
భీముఁడు పాఱిపోఁ జూచిన గోపన్న యాతని నాపి తన
ప్రాణంబులు గొనుమని యాతనిఁ బ్రార్థింప నా నీచుండును
నందుల కంగీకరించి కాకము మృతసర్పమును ఖండించు
భంగి నాతని ఖండించెను. పిమ్మట నాయుఁడు గోపన్న
యవయవ శకలంబులను గాంచి మిక్కిలి దుఃఖించెను.

నాయకురా లట్లు తన్నుఁ గుక్కుట ద్యూతంబున నోడించి
నను బ్రహ్మనాయుఁడు న్యాయ విదుండును సమయజ్ఞుండును
నగుట నా దుష్టురాలికిఁ బ్రతీకార మొనర్పక శపథ సమయ
ములకు బద్ధుఁడై మాచెర్లకుఁ జని జరిగిన విషయంబులు
బాలమల్దేవ నృపాలురకును దన బంధు మిత్రాదులకును
దెల్పి వారలఁ బ్రవాసంబున కాయత్తము చేసెను. ఒకనాఁ
డందఱును మాచెర్ల విడిచి బయలు వెడలిరి. వారు వెను
దోటకు రాఁగా నచట మాబాల ప్రథమ రజస్వల యయ్యె
నన్న మాట విని యచటఁ బదునేను దినంబులు గడిపి బయలు

వెడలి కృష్ణా సముత్తరణమునకై యేలేశ్వరపు రేవు చేరిరి. అచట గ్రద్దగుండను చోట నొక మకరము వారి కవరోధము కలిగింప బ్రహ్మనాయఁ డద్దాని మూఁడు దినములలో ఖండించెను. పిమ్మట వా రేలేశ్వరమునుండి పయినించి యచటికి మూఁడామడల దూరమున నున్న మండాది యను జనపదమున కరిగి యచట నివాసములు గావించుకొనిరి. బ్రహ్మనాయఁడు పశుగణంబులకు వలయు గోష్ఠములు నిర్మించి, లంకన్నను పశుపాలకునిగా నియమించెను. వారట్లు సుఖోపేతులై వత్సరత్రయం బచట వసించిరి.

ప్రవాసమున నున్నను నాయఁడు సర్వసుఖంబు లనుభవించుచున్నాఁ డను వార్త చారుల వలన విని నాయకురాలసూయావిష్టయై, మండాదిని దోపింప నెంచి యెఱ్ఱమల యందును నల్లమల యందును నుండు చెంచులకు నాయకుఁడగు పల్నీనికి వార్త నంప వాఁడు సైన్యసమేతుఁడై యేతెంచెను. నాయకురా లాతని సన్మానించి గోగ్రహణంబు గావించిన మాచెర్ల నతనికే యేలుకొన సిద్ధపరచునని బాసచేసి యాతని మండాది కంపెను. బోయలుత్సాహపూరితులై విరటుని గోవులఁ బట్టఁ బోవు కౌరవసైన్యము పగిది తమ నాయకునితో బయలు వెడలిరి. కతిపయ దినంబులకు వారు మండాదిచేరి పశువులను గోష్ఠముల నుండి వెడలించు నుపాయము లరయుచుండిరి. పశుశాలా ద్వారమున నిద్రించుచున్న లంకన్నను జూచి భయభ్రాంతులై లోపలి కరుగుట దుర్లభమని

యెఱింగి తత్సమీపమున నున్న పొదల మాటున కరిగి యచటి నుండి మొదవుపై శరవర్షము గురియింప సాగిరి. ఆ యంపవాన కాగఁజాలక గోనిచయంబు ద్వారము భేదించుకొని పాఱిపోవ నారంభించెను. గోష్ఠ ద్వారమున నిదురించుచుండిన లంకన్న గోప్పాద ఘట్టనలచే నలిగి కంపకొక కండమై పోయెను. లంకన్నతో నున్న బోయలు దొంగల నెదిర్చిరి గాని ప్రయోజనము లేకపోయెను. తుదకు దొంగలు చెదరిపోయిన మొదవులగుంపుగాఁ జేర్చి తోలుకొనిపోవుచుండిరి.

ఆ సమయమున బ్రహ్మనాయఁడు మంచ కడుజెన్ననికి బాయస మర్పించి వనమున విందారగింప సమిత్రబాంధవంబుగా వచ్చుచు, గోగణములం గొంపోవు తస్కరులఁ గాంచి యాశ్చర్యపడి కన్నమనీనిఁ గాంచి "కుమారా! మనగోవు లిట్లు వనంబున చెదరియున్న వేల? గోవుల వెంబడి వచ్చువా రెవరని ప్రశ్నించెను. కన్నమనీఁ డంతకుమున్నె పల్నిని నెఱిఁగిన వాఁడగుట వాఁడు గోవుల నపహరించుకొని పోవుచున్నాఁడని గ్రహించి, యా వార్త బ్రహ్మనాయనికిఁ జెప్పి యతనివలన సెలవుగైకొని దొంగలఁ జెండాడుటకై పోయెను. ఆ యంత్యజశూరుండు "తన పంద్రెండు మూరల భైరవ ఖడ్గముతో" నా తస్కరులఁ దునిమి గోగణంబుల మరలించుకొని వచ్చెను. అసువులు బాసిన లంకన్న విషయము బ్రహ్మనాయఁడు మిగుల దుఃఖించెను.

అట్లు లంకన్న మరణముచే బ్రహ్మనాయఁడు మిక్కిలి ఖిన్నుఁడై యిఁక మందాది నుంట క్షేమంకరము

కాదని తన యాప్తవర్గంబునకుఁ దెలిపి వారలఁ బ్రయాణ సన్నాహులఁ గావించెను. వారా రాత్రి యెట్లో వేఁగించి పెందలకడ లేచి పయనించి దొమ్మర్లగొంది యనుచోట కృష్ణాపగను దాటి, తత్తీరంబున నొక వాసరము గడిపి, మరలఁ గతిపయదిన ప్రయాణంబుల శ్రీశైలముఁ జేరి, యచట నధివసించు మల్లికార్జునిఁ గొనియాడి, యచటి పుణ్యతీర్థముల స్నానమాడి కృతకృత్యులైరి.

ఆ సమయమున నా పర్వతాధిపుండగు మాకమహీపతి భృత్యామాత్య సహితుండై శ్రీశైలపతిని సేవించుటకై యచటికి వచ్చి బ్రహ్మనాయనిఁ గాంచి "మహాత్మా! మీ రెవరు? మీ రెచటినుండి యెచటి కేగెదర"ని ప్రశ్నించెను. అందులకు బ్రహ్మనాయఁ డలఁగు తామ్రపతి తీర్థయాత్ర మొదలుకొని తనకుఁ బ్రవాసము ప్రాప్తించువరకుఁ గల పల్నాటి వృత్తాంతము నానృపున కెఱింగించెను. రాజాతని పలుకులకు జాలిగొని యుండ బ్రహ్మనాయఁడు మరల "రాజేంద్రా! ప్రాణిద్యూతమున విజితుండనగుట స్వస్థలముఁ బాసి పరదేశముల నాశ్రయింపవలసి వచ్చినది. నేను నీకుఁ జెప్పవలయునె? నన్ను మీ సమానునిగా నెంచి యొక రాజ్యమునకు నేలికగా నన్ను నియమింపుఁడు. ఇదిగో, నా యీ వచ్చలఖడ్గమును గుదువపెట్టుకొని యెనుబదివేల రామమాడ లిమ్మ"ని మాకప్రభువు నర్థించెను. ఆ నరపాలుండు నాయని దీన వచనంబులకు జాలిపడి మారకాపురము, దూపాడు, కొచ్చెర్లకోట, నదగోడు, త్రిపురాంతకము

మున్నగు నిరువదిరెండు జనపదంబు లాతనికి గుత్తగ నొసంగెను. నాయుఁడు మిగుల సంతసించి, భూపతివలన వస్త్రాభరణాది బహూకృతులంది శైలంబు డిగ్గి త్రిపురాంతకమునకు వచ్చి యచటఁ గొన్నిదినంబులుండి శివుని భజించి, పిమ్మట మారకాపురంబున కరిగి యచటఁ జెన్నకేశవాలయము మొండు కట్టించెను. అనంతరము మేడపికిఁ జని, యద్దానిఁ దనకు ముఖ్యస్థానముగాఁ జేసికొని నిత్యకల్యాణమును బచ్చతోరణమునై బాంధవాసీకములు సంతసింప రాజ్యపాలన మొనర్చుచుండెను.

బ్రహ్మనాయఁడు వీర మేడపియందు శపథవర్ష శేషము గడపి, లెక్కచూచి సప్తవర్షములు సమాప్తమగుట తెలిసికొని నలగామరాజుకడకు రాయబార మంపవలయునని తన యాప్తులతోఁ జెప్పెను. అందుల కాపోటుమన్నీలు 'నేను పోయెదను, నేను పోయెద'నని నాయునికి విన్నవింపఁ దొడఁగిన, నాతఁడు వారల నూరకుండుఁడని చెప్పి, యలరాజు నలగామునకుఁ బ్రియంబుఁ గూర్చు నల్లుఁడగుట నాతనిఁ బంప నిశ్చయించెను.

అలరాజనకు రాచమల్లను నామాంతరము కలదు. ఇతఁడు కల్యాణపురాధీశుండగు కొమ్మరాజు తనూభవుఁడు. ఇతని తల్లి చెల్లాంబ. ఇతని తాత వీరసోముఁడు. కొమ్మరాజు తన సోదరిని పెదమల్లిదేవున కిచ్చి వివాహము గావించి నాయుని వీరవర్గమునఁ జేరి మాచెర్లయందే వసించుచుండెను. నాయఁడలరాజును రాయబారిగ నంపగోరి, కొమ్మరాజు

చెంతకుఁబోయి తన యుద్దేశము నాతని కెఱిఁగింపఁ దన భార్య యందుల కియ్యకొనినఁ దనకెట్టి యభ్యంతరము లేదని తన సమ్మతిని వెలిబుచ్చెను. అంత నాయఁడు చెల్లాంబ చెంతకుఁ జని తన కుమారుని నలగామరాజుకడకు రాయబారిగ నంపవలెనని వచించిన నా సాధ్వి పిడుగులవంటి యా నుడు లాలించి మూర్ఛిత యయ్యెను. కొంతవడికి నాపె తేఱుకొని యశ్రుకణంబులు తొరఁగ నాయనిఁజూచి "పెద్ద నాయఁడాది మహావీరులుండ సంధికార్యమున కంపుటకు నా సుతుఁ డొక్కఁడే నీ కంటఁ బడెనా? చెల్లెలు, చెల్లెలని నన్నుఁ జెఱుపఁ బాడియే" యని క్రిందఁ జదికిలఁ బడెను. నాయఁ డామె నోదార్చి, యామె తనయుని ప్రాణమునకుఁ దన ప్రాణమిని నమ్మఁబలికి చివర కామె నొడఁబఱచెను.

బ్రహ్మనాయఁ డలరాజునకుఁ జెప్పవలసిన మాటలన్నియుఁ జెప్పి చివరకా నలగాముఁడు సంధికి నొడంబడి మన రాజ్యము మరల మనకీయఁడేని యుద్ధమునకు సన్నద్ధుఁడు కావలయునని చెప్పుమని చెప్పి యాతని నంపెను. అలుగురాజట్లు నియుక్తుండై నవతాల గోడిగ నెక్కి గుర్రిజాల కరిగి రాజదర్శనము చేసెను. రాజాతని మన్నించి వచ్చినకార్య మడుగ నతఁడు "భూవర! కుక్కుట సమరంబున నోటువడిన నాయఁడు శపధంబునకుఁ గట్టువడి సప్తసంవత్సరములు ప్రవాస మొనరించి యిప్పుడు తిరిగి రాఁగోరుచున్న వాఁడు. నీ దాయాదుల కర్ధరాజ్య మొసఁగి వారును మీరును గలిసి యుండుట లెస్స. అట్లు పాలిక దురము సేయ నెంచితి రేని పెక్కుడుమలఁ

గుకువవలసి వచ్చును. బాలుఁడనని నామాటలు నిర్లక్ష్యము సేయకుఁ"డని పలికెను. అప్పలుకులకు నలగాముఁడు దండతాడితభుజంగమంబుచాడ్పునఁ గనలి "ఓయి! నాయుఁడు నీవు చెప్పునంతటి పరాక్రమశాలి కాఁబట్టియే నేఁడు పరపంచలఁ దలదాఁచుకొని యున్నవాఁడు. మా సైన్యబలంబు నెఱుఁగక యిట్లు వాయికి వచ్చినట్లెల్ల వదరెదవు. ఏమో మా యింటి యల్లుఁడవని నిన్ను బ్రాణములతో వదలుచున్నాను. సమరంబునఁ దోడ్పడ నాయని కెవరు దిక్కు! మాకాప్తులగు రాజుల బలంబులు లెక్కకుఁ బిక్కటిల్లి యున్నయవి"యని తీక్ష్ణముగా వచియించెను. అందుల కతఁడు "రాజా! నా చెప్పు వచనంబులు నీకపథ్యము లగుచున్నవి. రణరంగమున సైన్యములఁ గోలుపోయి గడ్డి గఱచునాఁడు నా పలుకులు త్రవ్వి తలపోసికొందువుగాక. నీబుద్ధి పెడతల బట్టినది. పోఁగాలము వచ్చినపు డెవ్వరేమి చేయఁగలరని పలికి గురిజాల వీడి యచటి కనతిదూరమున నున్న చెర్లగుడిపాటి కరిగెను. అతఁ డచటనుండ నాయకురాలు విషదిగ్ధపుష్పములు కొన్ని వారవిప్రునిచే నతని కంప నతఁడు వాని నాఘ్రాణించి వెంటనే విగత జీవుం డయ్యెను.

అట్లు పడియున్న యలరాజుం గాంచి కన్నమనీఁడు గురిజాల కరిగి యంతఃపురంబున నున్న రత్నాల పేరాంబకుఁ దన పతి మరణవార్త నెఱిఁగించెను. దారుణంబగు నావార్త విని యా మదతీరత్నము దుఃఖసముద్రమున మునిఁగి కన్నమనీనితోఁ జెర్లగుడిపాటి కరిగి భర్తశవంబు నొక యందలమున

నునిచికొని తన తండ్రి కొలువుకూటమున కరిగి యాతని బహువిధంబుల దూషించి, యా శవంబును మరల నెత్తించు కొని మేకపి కరిగెను. నాయుఁ డలరాజు మరణంబునకు మిగుల దుఃఖించి రత్నాల పేరమ్మ నుచితాలాపముల నూరడించి యలరాజున కగ్నిసంస్కారము లొనరించెను. రత్నాల పేరమ్మ వీరవనిత యగుట సత్తజిహ్వుని సాయమునఁ బతిఁ జేరఁబోయెను.

సంధికార్యమట్లు పొసఁగకపోవుటయేకాక రాచమల్లు నట్లు కపటోపాయంబునఁ జంపినందులకు నాయుఁడు ప్రచండ కోపానల దందహ్యమాన మానసుండై సకల బంధువులను భృత్యులను, వీరనాయకులను బిలువనంపి 'చూచితిరా నల గాముని దుండగములు.' దౌత్య మొనరింపఁబోయిన రాచ మల్లు నన్యాయముగఁ దుదముట్టించె. నాయకురాలి సాయ మున జయ మొందఁగలనని రణమునే వాంఛించుచు మనలఁ జీరికిం గొనఁడు. నలగాముఁడు, నలసింగుఁడు, నాయకురా లను దుష్టత్రయమును నంతమొందింప వీరకంకణములు ధరిం పుఁడు. ఐవరమున నరివీరులఁ బిలుకుమార్చువఱకు మీ కళ త్రములను సోదరీభావంబునఁ జూడుఁడు. అట్లొనర్పనివాఁడు యమాలయమున వెట్టి చేయవలసివచ్చు" నని కఠినముగా శాసించెను. ఆ పలుకులు విని వీరనాయకులు తమ భుజముల తీఁట వాపుకొనఁ దరుణము లభించెఁగదా యని యుప్పొం గుచుఁ దమ తమ సైన్యముల నాయత్తము గావింపసాగిరి. సర్వసైన్య సన్నాహములఁ గావించుకొని; నాయుఁడును,

మలిదేవాదులును బ్రవిదారణోత్సాహులై రణభేరీభాంకృతులు మిన్నుముట్ట, వీరవనితలు సౌధాగ్రములనుండి పుష్పవర్షములు గురిపింపఁ బయలువెడలి త్రిపురాంతకమునకుఁ జని యచటి త్రిపురాంతకుని భజించి, మేళ్ళవాగు చేరి, యటఁ గొన్నిదినంబు లుండి కార్యమపూడి కరిగి నాగులేటి పశ్చిమ తటంబున విడిసిరి.

నలగామభూపాలుఁ డింకనైన బుద్ధికుదిరి సంధికి వచ్చునేమో యని తలంచి నాయఁడు భట్టుమూర్తి యనువాని రాయబార మంపెను. అతఁడు గురిజాలకుఁ బోయి రాజును జూచి, యన్నివిధముల సంధి గావించుకొనుట యుచితమనియు, యుద్ధమువలనఁ బెక్కుడుములు వచ్చుననియు బోధించెను. కాని నలగాముఁడు నాయకురాలి చెవిగిఱపులకుఁ జెవి నిచ్చి, యాతని మాటలు పాటింపక యవమానించి పంపివేసెను. ఆ దూత తిరిగి వచ్చి జరిగిన విషయము నాయనికిని మలిదేవాదులకును దెలియఁజెప్పెను.

వచ్చిన దూత నట్లు సాగనంపి నలగామ వసుధాధిపుఁడు తనకు దురంబునఁ దోడ్పడ సైన్యసమేతులై రండని తన కాప్తులగు మహీపతులకుఁ బత్రికాముఖంబునఁ దెలియఁజేసి, తానుఁ జతురంగబలంబులఁగూడి కార్యమపూడి కదనరంగమునకుఁ గదలెను. తమప్రభువు సమరమున కేగుచున్నాఁడను వార్త విని కొదమగుండ్ల పౌరు లాతని మార్గమున సంధించి, యుద్ధము సేయుట సరికాదనియు, నన్నదమ్ములు మైత్రిగలిగి జీవించుట క్షేమమనియు బహుభంగుల నాతనికి

బోధించిరి. శాత్రవుల పీఁచమడచి యచిరకాలంబున మగుడ వచ్చెదనని వారల నూఱడించి ప్రయాణము సాగించెను.

నలగామరాజు కార్యమపూడి చేరి సర్పనదికిఁ దూర్పున విడిసెను. అతని యాప్తులగు ధరావరు లెల్లరు సైన్యసమేతులై వచ్చి తన్నదీతీరమునఁ బటకుటీరముల నిర్మించుకొని యందు వసించి యుండిరి. పెదనాయుఁడు, పేర్నీఁడు, గండు కన్నమనీఁడు, సుంకర దామానాయుఁడు, వీర పతాలుఁడు, కన్నమనీఁడు మున్నగు వీరపుంగవులు రణకేళి యొనర్ప నుత్సాహపూరితులై నాయని యాజ్ఞకై వేచియుండిరి. ఏగిర పాటు వలదని నాయుఁడు వారలకు హితములు గఱపుచుండెను.

అట మేడపియందు బాలచంద్రుఁడు నంగడీలఁగూడి యాటపాటలఁ గాలము పుచ్చుచుండెను. ఒకనాఁ డతఁడు నిజజననిం జేరి యాడుకొనుటకు బొంగరము లిమ్మని యామె నర్థించెను. అందుల కాకాంత బొంగరములు రాజార్హక్రీడ కాదనియు, వీధుల సామాన్యబాలకుని వలె బొంగరా లాడిన వచ్చుచుఁ బోవువారు నవ్వుదురనియు, మొగసాలలో హితులఁగూడి రాజార్హంబులగు క్రీడల నాడుమనియు బోధించెను. తల్లి యెంతచెప్పినను వినకుండుటచే నామె శిల్పుల రావించి, సువర్ణవికారంబులగు బొంగరములు చేయించి యిచ్చిన బాలచంద్రుఁ డవ్వానిఁగొని నేస్తకాండ్రఁగూడి పురవీధుల భ్రమరక క్రీడకుఁ గడంగెను. ప్రేక్షకు లాతనియాట కాశ్చర్యపడుచు గుంపులుకట్టి చూచుచుండిరి.

మేడపియందు ధనంజయుఁడను వైశ్యశిఖామణి యొకఁ డుండెను. సప్తర్షి పత్నులంబోని యాతని యేడుగురుకోడండ్రు తత్పురంబునంగల 'గడ్డిగాలబావి'కిఁ బోయి జలములుగొని వచ్చుచు రాజమార్గంబున బొంగరములాడు బాలచంద్రుని నాతని సంగడీలను గాంచి నిశ్చేష్టలై గృహ వ్యాపారంబులు గూడ మఱచి యట్లే నిలిచి చూడసాగిరి. అంతలో బాలుఁ డెగురవైచిన బొంగరము గగనపథంబున కెగసి గిరగిరఁ దిరుగుచు వచ్చి యూరుజాని కడగొట్టుకోడ లగు వేషాంబ పఱతలంబుఁ దాకిన నా కోమలాంగి నిర్ఘాతపాతంబునఁ దూలు నీపలతికవోలె మూర్ఛిత యయ్యెను. కొంతతడవునకుఁ దెలి వొంది యా లతాంగి "ఓరి దురాత్మా! అత్తచాటుదాననగు నేను నలుగురి నోళ్ళలో నానవలసి వచ్చెనే! నన్నవమానింప నీ కెట్లు చేతులు వచ్చెను. నీ వంశము పాడుగాను. నిన్ను శత్రువు లీఁటెలతోఁ గ్రుచ్చ! నీ సౌందర్యమును వీక్షింపఁ గోరుటచేత నా కీ ఫలము. పుట్టినింటికిని మెట్టినింటికిని నన్నెడఁబాపఁ జూచితివి. ఇట్టివాఁడవగుటఁ గదనరంగంబున నీ తండ్రిని శాత్రవుల కర్పించి, గృహమున హాయిగాఁగుడిచి కూర్చున్నవాఁడ"వని బాలుని శపించెను. తన్నట్లు నిందించు సుదతీరత్నముం గని యామె పదంబునుండి స్రవించు రుధిర ధారను తన యుత్తరీయమునఁ దుడిచి, యామె క్షమాపణంబు వడసి యమూల్య రత్నాభరణంబు లొసఁగి యూరార్చి శాత్రవ సంహారార్థము తన తండ్రి యరిగిన కారణంబు దెలుపుమని వేడుకొనెను. ఆ వైశ్యకాంత యాతని తండ్రి

వృత్తాంతంబు సవిస్తరముగ నెఱింగించి యాతడప్పుడు నాగు లేటి తీరంబున సాంపరాయమునకై సర్వసైన్య సమేతుండై యుండిన విషయ ముగ్గడించెను.

అట్లా కాంత వచించిన వాక్యముల కానందించి బాలుఁ డాపె నత్తవారి యింటికిఁ జేర్చి జరిగిన విషయము సర్వము నివేదించి సంగడీలఁ గూడి నిజధామంబున కరిగి మైలాం బికా పాదపద్మముల కెఱఁగి "జననీ! మజ్జనకాదు లెచటికిఁ బోయిరో యెఱింగింపు"మని వేడుకొనెను. అప్పలుకుల కా సాధ్వి భయసంభ్రమంబులు మల్లడిగొనఁ గొంతదనుక యవ శయై తెప్పఱిలి "పుత్రా! నీకు వారిజోలి యేల? వారొక కార్యార్థ మరిగిరి. త్వరలో నిటకే తెంతురు. విచారపడకు" మని యూఱడింపసాగెను. ఎంత చెప్పినను వినకపోవుటం జేసి యాకాంత 'కుమారా! నీ జనకాదులు దుర మొనర్పఁ గారెమ పూడి కరిగిరి. యుద్ధమున భ్రమరక్రీడ కాదు సుమీ. నీ బోఁటులు రణభూమినైన నీక్షింప నోడుదురు. కుడిచి కూర్చుండక యెందులకు నీకీ యుద్ధప్రసక్తి. చలికాండ్రఁ గూడి యాడుకొ'మ్మని హితోక్తుల బుద్ధిగఱపెను. జనని వచనంబు లుపేక్షించి బాలుఁడు రణభూమి కేగుటకు సెల వొసంగుమని యామె నర్థింపసాగెను. ఒకవేళ భార్యపై మరులుకొల్పిన నతఁడు తన ప్రయత్నమును మానునేమో యని యెంచి మైలాంబ యాతని భార్యకడకుఁ బోయి యాపె యాశీస్సులు బడసి రణంబునకు జనుదేరు మని చెప్పెను.

బాలచంద్రుఁ డందులకు సమ్మతించి మంచాల దర్శనోత్సుకుఁడై బయలు వెడలెను.

బాలునికన్నమున్నె యైతాంబ నిజసుతాగమనవార్త మంచాల కెఱింగింపఁగోరి తోడికోడంద్రఁ గూడి వియ్యాపురాలగు చెల్లాంబకడ కేగిన నా యిల్లాలు వారిఁ గన్నులకద్దుకొని యుచిత సత్కారంబుల గౌరవించెను. మంచాల తన యత్తలకు మ్రొక్కి వారి దీవనలు వడసెను. పిమ్మట నైతాంబ తన కుమారుని రాక కోడలి కెఱింగించి, "బాలా! బాలచంద్రుఁడు రణరంగమున కేగ నాతుర పడుచున్నవాఁడు. కావున నీవు వానిని సురతాదిక్రీడలఁ దేల్చి తత్ప్రయత్నమునుండి మరల్పవలయు"నని బోధించెను. అందులకు మంచాల బాలచంద్రుని భుజంగతఁ దెగడినను నత్తమాట శిరసావహించెద నని వాగ్దానము చేసెను. ఐతాంబ కోడలిని 'వీరపత్నివి కమ్మ'నిదీవించి తోడికోడంద్రఁగూడి నిజధామంబునకుఁ జనెను.

మఱునాఁ డరుణోదయమున బాలుఁడు తన హితులం గూడి, తల్లికిఁ బితామహికిని మ్రొక్కి వారి దీవనలు గొని మంచాల గృహంబున కేగుచు మార్గమధ్యమున నున్న తన వేశ్యాంగన యగు సబ్బాయి యింటికిఁ జని యటఁ గొంత తడవుండి శిబికంబు నెక్కి మంచాల గృహంబు డాయంజన నచటి చేటిక లాతని రాక మంచాల కెఱింగించిరి. ఆ వార్త విని వ్రీడాభక్తిభయంబులు ముప్పిరిగొన నా చంద్రవదన చంద్రాగమమున నుప్పొంగు చకోరంబుక్రియ సంతసించి

రత్నకలశంబున విమలతోయంబులు గొని నిజనాథు పద క్షాళనార్థ మెదురుగా వచ్చెను. బాలుఁడు నిజాంగనా వపుః సౌష్ఠవముఁ గన్నులఁ ద్రావుచు హితుల నందఱ వెనుకకుఁ బో నియమించి బ్రాహ్మణబాలుండగు మనుబోతురాజును దానును ముందఱకుఁజని నిలిచిరి. నిజవల్లభు ముఖదర్శన భాగ్యము బహుకాలమునుండి యెఱుంగనిదగుట నా ముగ్ధ వారిద్దఱిలోఁ దన భర్త యెవ్వరైనది గుర్తింపఁజాలక మనుబోతురాజు తన ప్రాణవిభుఁడు కానోపునని యెంచి యాతని పదపద్మములు గడిగెను. అదిచూచి యా భూసురుడు 'వదినె, నీ భర్తయగు బాలచంద్రుఁ డిచ్చటనుండ మొదట నా పాదములు గడుగుట యొప్పునే?' యని ప్రశ్నించిన నా నాతిమిన్న 'విప్రడింభకా, నా పతి యిలు సేరిన ధరామరపాదంబులు గడుగుదునని మ్రొక్కుకొంటి' నని సమయోచిత వచన రచనా చమత్కృతి వెలయఁ బ్రత్యుత్తర మొసఁగెను. పిమ్మట నా వినయశీల నిజమనోవల్లభుని పాదమ్మొక్కటి కడిగి రెండవది కడుగక యట్లే నిలిచినఁ గని మనుబోతురాజు "వదినె మాయన్న పాదం బొకటి కడిగి రెండవది కడుగక యట్లేల నిలిచితి" వని ప్రశ్నించెను. అందుల కాపె "మీయన్న ద్వితీయ పాదమును సబ్బాయి కడుగునని యెకసక్కియము లాడి యనంతరము నిజభర్త ద్వితీయ చరణముఁ గూడఁ గడిగెను. పిమ్మట నందఱుఁ దమ తమ నియమిత స్థానంబుల కేగిరి.

మంచాలయు బాలచంద్రుండును గృహారామంబున కరిగి యచటఁగల చోద్యంబు లరయఁజొచ్చిరి. కొంతతడ వట్లు విహరించిన పిదప సూర్యాస్తమయముకాఁగా నా దంపతులు మందిరములోని కరిగిరి. భోజనావసరమున మంచాల రసము పిడియఁబిండిన యామ్రఫలంబులు కొన్ని యొక సువర్ణ పాత్రయం దిడుకొని యారగింపుమని తనభర్త కొసంగెను. అతఁ డవి రసవిహీనంబు లగుటఁ గాంచి యట్టి ఫలంబులు తన కేల యిచ్చితివని ప్రశ్నించిన నా మించుఁబోఁడి మొలక నవ్వు దొలఁక "నాథా! వాని సారము సబ్బాయి గ్రహించుటచే నవి నిస్సారములైన"వని తెలిసేసి పిమ్మట షడ్రసోపేతంబులగు నాహారంబులు తెచ్చి యాతని ముందర నిడి యారగింపుఁడని పలికెను. అప్పుడు బాలుఁడా యువతీలలామం గాంచి "సుదతీ! మన్మథతాపం బగ్గలమగుచున్నయది గావున నీవు నాపొత్తునఁ గుడిచి నాయభీష్ట మీడేర్పు" మని పలికెను. అందుల కాసతి "ప్రాణనాథా! సత్కులసంజాత లగు కాంతలు కాంతునితో నేకపాత్రమునఁ గుడుచుట యొప్పునే? అయ్యది సబ్బాయికి జెల్లునుగాని యన్యుల కెల్లలవదు'' అని వచియించెను. ఆమాట లాలించి బాలచంద్రుఁడు యథోచితముగ భుజించి పూసెజ్జపై నత్తమిల్లి గాఢనిద్ర మునింగెను.

ఆ సమయముఁ గనిపెట్టి మంచాల నిజజనని కడకుం జని బాలుఁడు తన యొద్దకు వచ్చిన కారణం బామెకు నివేదించెను. అంత రేగాంబ నిజ దుహితంగాంచి ''పుత్రీ! నీ విప్పుడు విభుం గూడి యల్పసుఖంబులు పడయఁగోరిన

ముప్పువాటిల్లు. రిపు సంహారమగు దనుక వీరనాయకులెల్లరు దమకళత్రములఁ దోఁబుట్టువు లట్లు భావింప వలయునని బ్రహ్మనాయుని సుగ్రీవాజ్ఞ యెఱుంగవే ! నీవు పతిని రతి క్రీడలఁ దన్పక యేదో యొకరీతి నీ రాతిరి గడుపుము. ఆతని రణంబున కంపిన నీకు శుభము కలుగును వేఱొండు సదు పాయము వచింపేద నాకర్ణింపుము. నీ భర్త నిదురించు వేళ నాతని యురమున నీ కరతలం బుంచుము. అయ్యది శీతల ముగానుండిన నతని పాత్రలో భుజించి యాతని మరుకేళి నోలలాడింపుము. అట్లుకాదేని సురళంబున కూడఁ బడకు మ'ని హితోపదేశం బొనర్చెను.

మంచాల మరలి వచ్చి సుషుప్తి యందున్న పతి హృద యంబుపైఁ జేయిపెట్టిన నది భగ్గున మండ నింక భావజకేళి తగదని యెంచి యతని పాత్ర నవలఁ ద్రోసి మఱియొక పాత్రమున భుజించెను. కొంత తడవునకు బాలుఁడు ప్రబుద్ధుండయి మరుని పూవుటమ్ము చందంబునఁ దన ప్రోల నున్న నిజసతిం గాంచి మన్మథావేశంబున నామెఁ గవయఁ బోయెను. అంతట నాతని కొనగోటి తాఁకున నామె ముత్యాలసరంబు తెగి యాణిముత్తెము లన్నియుఁ బుక్కల వడువున నేలపై రాలెను. అప్పు డా సుందరాంగి భర్తను గాంచి "నీవు నను గ్రుచ్చి కౌఁగిలింపఁ గోరిన యట్లే యీ హారంబును గ్రుచ్చి నాకంఠము నలంకరింపుఁడ'ని విన్న వించెను. బాలుఁ డట్లేయని దారముంగొని యొక కొన మంచాలచేతికి నిచ్చి రెండవకొన దాఁగొని ముత్తెములు

కూర్చ సాగెను. మంచాల కాలము బుచ్చఁగోరి తన దయిత
నకు దెలియకుండ నొక్కొక్క మాత్రికమును జాఱఁదీ
తన యుత్సంగమున నిడుకొనుచు మరల వానినే యతని
గ్రుచ్చుమని యొసంగుచుండెను. ఎంతకును ముత్తెముల
తరుగవాయెను. బాలుఁడు సంశయించి రెండవ కొనను దా
ప్రేలికిఁ జుట్టుకొని సరముఁగూర్చి కొలికి ముత్తియ మిమ్మ
యాపె నడిగెను. అందులకు మంచాల "ఆర్యపుత్ర
కొలికిపూస నందుకొని పోయి సబ్బాయి కియఁజూచ
చుంటివే! చాలు చాలు. నీ కట్టుబట్టలోఁ గలదేమో
చూడు మని దరహాసము చేయుచుఁ బల్కెను. బాలుఁడ
తన వస్త్రమును విదిల్చిన నది క్రిందఁబడెను. మంచాల దీ
రహస్యముగాఁ గైకొని గుప్తము గావించెను. బాలుఁడ
దానికై యటు నిటు వెదకుచుండ కొక్కొరొకో యని కో
గూసెను.

తెల్లవాఱఁగనె బాలచంద్రుని సంగడీ లంతఃపుర కవా
టంబు చెంతకుం జని యాతనిఁ బిలిచిరి. అతఁ డెంతకును
బలుకకుంటచే వా రాతని నిందింప సాగిరి. బాలుఁ డం
మేల్కని స్వకార్యము మఱచుట కెంతయు సిగ్గునొంది
రణోత్సాహంబు సందడింపఁ దన యడిదముం గొని మంచా
కొసఁగి తన్ను దీవింపుమని యాపెను వేడెను. అంత న
వీరపత్ని యా కృపాణమును గేల ధరించి "నాథా! వీ
భద్రుని విక్రమంబును, వాయుతనూజుని ఘనజవంబును
పడముడి బాహుబలంబును, నభిమన్యుని సాహసంబున

గలుగ నీ వరివీరులఁ గడనరంగమున నంతమొందించి విజయలక్ష్మిఁ జేపట్టెదవు గాత" యని దీవించెను. పిమ్మట నా యుడిదంబు భర్తకు నొసఁగి రూపొందిన పతిభక్తి చందంబున నాతని పదనాళీక యుగ్మంబునకు నమస్కరించెను. అనంతరము మంచాల రహస్యముగా భర్తను గని మనుజోతుము కదనరంగమునకు గొంపోవలదనియు, నతఁడు మడిసిన బ్రహ్మహత్యాదోషము ఘటిల్లుననియు, నేదేని నెపమున నతని దిగనాడి పోవలసిన దనియు హితము గఱపెను బాలుఁ డట్లు నిజపత్నివలన సెలవు గైకొని హయారూఢుడై సంగడీలు వెంటనంటిరాఁ దాను తగరు నెక్కి కార్యమపూడి కదనరంగమునకు గదలిపోయెను.

బాలచంద్రుఁడు సంగడీలఁగూడి కొంత దవ్వరిగిన పిదప మనుజోతు రాజుం గాంచి 'మిత్రమా! అంతఃపురంబున నా యుంగరము మఱచి వచ్చితి. నీ వద్దానిం గొని వైళంబ రమ్మ'ని యాతని నంపెను. అతఁడును హుటాహుటిం జని బాలుని యుంగర మిమ్మని మంచాల నర్థించిన నామె "దివిజోత్తమా! నీవు సామాన్యుఁడవుగా నగపడుట లేదే. లేనిపోని నిందలు నాపై మోప నెంచుచున్నావు. బాలుఁడు తన యుంగరమును మఱచునంతటి స్త్రీలోలుఁ డను కొంటివా? కనుఁబ్రామినిన్ను బురమున దిగనాడి పోవ నతఁడు పన్నిన పన్నుగడగాని వేఱొండుగాదు. నీవు సత్వరముగ నేగి వారలఁ గలియుఁ బొమ్మ"ని పలికి యాతనిఁ త్వర పెట్టెను.

మనుబోతును దిగవిడిచి పోవ సంకల్పించుకొనిన వాఁడ గుట బాలచంద్రుఁడతని పునస్సంధానమునకై సంకేతించిన స్థలమున నిలువక రొయిక కమ్మ వ్రాసి సమీపమున నున్న తంత్రిణీ వృక్షశాఖకుఁ గట్టి హితులతోఁ బెడదారిఁబట్టి వెడలి పోయెను. మనుబోతురాజు మంచాలను వీడుకొని తన స్నేహితులఁ గలిసికొనుటకు మిగుల వేగముగా నేగు చుండెను. అతఁడు బాలుఁడు నిర్దేశించిన స్థలమునకు రాఁగానె యాతని తత్తడి తత్తరమొంది ముందడుగిడక స్థాణువవలె నిలిచిపోయెను ఎంతకొట్టినను నయ్యది కదల కుండుట కాశ్చర్యపడి యతఁడు క్రిందికి దిగి నల్దెసలు పరి కించుచుండ నెదుటి నున్న వృక్షశాఖయందు గాలితాఁకుడం లచే నూఁగు లేఖ యాతని కంటఁబడెను. అందతఁ డిట్లు చదివెను. "మనుబోతురాజా! నీవు బ్రాహ్మణుఁడవు. రణ విద్యానిపుణులగు శూరావతంసులకు భూసిలింపుల సహాయ మపేక్షింపఁ దగినది కాదు. కదనరంగమున నీ రుధిర మొలి కిన మాకు దోషము కలుగును. కావున నీవు పురంబుననె యుండి యంతఃపురమును రక్షించుచుండుము. భవన్మిత్రుఁడు బాలుఁడు". ఆలేఖ పఠించి మనుబోతురాజుస్సురని నేలపైఁ జతికిలఁబడి వేడి నిట్టూర్పులు పుచ్చి యిఁక బ్రతుకు బరువు చేటని యెంచి బాలుని మనంబున ధ్యానించి యోగధారణ మున నసువులు వాయఁ గృతనిశ్చయుఁడయ్యెను. అత్తతి మాడచి (అన్నపిన్నక్క) యను నొక చేడియ వీరుల కాహార పదార్థములు గొనిపోవుచుండుటఁ జూచి యామెను

బిలిచి తన నిశితకరవాలంబునఁ దనరక్తనాళము నొకదానిఁ జీల్చి యారక్తమునఁ దన జన్నిదముఁ దడిపి యాతఁడు చేతి కిచ్చి 'మగువా! నీవు వీరుల కన్నము వడ్డించువేళ నిద్దాని బాలునిచేతిలోఁ బెట్టుము'ని వేడుకొని యుడిదంబున నురము గ్రుమ్మకొని యసువులు దొరగెను. బ్రాహ్మణుని సాహసమునకు కాచాన యబ్బురం పడుచు వెడలి పోయెను.

అట కార్యమపూడియందు యుద్ధమునకు సన్నద్ధులై విచ్చేసిన నలగామరాజునకును బ్రహ్మనాయనికిని సంధి పొసఁగెను. నలగామరాజు బాలమల్దేవులకు నర్ధరాజ్య మీయ నొడంబడెను. కావున నుభయసైన్యములవారును రణోత్సాహంబు మాని పరస్పరాన్యోన్యభావంబు వహించి తమ సమాధాన సూచకంబుగ విందు గుడువ సంసిద్ధులై యుండిరి.

అట్టుండ బాలుఁడు సంగడీలఁగూడి తగరువాహనారూఢుండయి రూపొందిన యగ్నిచండంబున నాయకురాలి కనుమ మార్గమున కార్యమపూడియందున్న నిజజనకుని స్కంధావారప్రవేశము గావించెను. అట్లు చుక్క తెగిపడిన విధమునఁ దన మ్రోల గోచరించిన తనయునిఁ గాంచి యాశ్చర్యపడి, యాతనిఁ గౌఁగిలించుకొని మేడపి మందలి యోగక్షేమంబు లడిగి విందారగింప సర్వనదికిం బోయి యవగాహం బొనరించి రమ్మని వీడుకొల్పెను.

ఉభయసైన్యములం గల దండనాయకులును, వీరావతంసులును నాయుని పటకుటీరంబున విందు గుడువ సభావేళ

మైరి. అందఱును బారులుదీరి కూర్చుండిరి. అంతలో బాల చంద్రుండును, నతని సంగడీలును గృతావగాహులై వచ్చి కొలకుచోc గూర్చుండిరి. వడ్డించువారు వడ్డింపసాగిరి. అట్టి యెడ మాడవి బాలున కన్నము వడ్డించి దాసితోc బాటు తాc దెచ్చిన మనుబోతురాజు రక్తసిక్తమగు యజ్ఞోపవీతము నాతని పాత్రమునc బెట్టి ధరామరబాలకుని మరణవిధాన మాతని కెఱింగించెను. బ్రాహ్మణడింభకుని మరణవార్త చెవి సోకిన బాలుcడు వ్యసనాక్రాంతుండై, తన మనోవ్యథ బయలుపడనీక నిజజనకుం గాంచి "జనకా! నీవు సర్వజ్ఞుండవు. నిన్నొక్క ప్రశ్న యడుగ నెంచితి. బాలుcడని నాయందుc దప్పు లెన్నకుము. దుష్టుcడగు నీ వలగాముcడు నాయకురాలి దుర్బోధలకుc జెవి నిచ్చి బాలమర్త్యులc జంప నెంచె. మాచెర్లలో మన వైభవమునకుc గన్ను కుట్టి తస్కరుల వంపి మనపురంబుc దోcపింపcజూచె మాయాద్యూతంబున మనల నోడించి పరపంచలనుండc బంచిరి. అల్లుcడనియైనc దలంపక యలరాజు నట్లు చంపించె. కావున నిట్టి దుష్టపంక్తి గూర్చుండి మడిచి చచ్చుటకన్న శౌర్యముతోcబోరి రణరంగమునc జచ్చుట వేయిమడుంగులు లెస్స. దీనులమై యాచించి యర్ధరాజ్యముcబడయుట కన్న మరణము మేలు. దేహియని యాచించుటకు మనము బాడబులమా? రణమున వరినృపాలాధముల నుక్కడంచి రాజ్యలక్ష్మిcజేపట్టుట వీరధర్మము కాదె?" యని వీరాలాపంబులుగ్గడించి చాలించెను. బాలుని స్నేహితులావచనంబులువిని

మీసమ్ము లుప్పొంగ నాతని వేనోళ్లఁ బొగడఁజొచ్చిరి. అట్లు వచించి బాలుఁడు తన భోజనపాత్రను విడిచి బయటకుం జనెను. వెంటనే యాతని చెలికాండ్రును నతని ననుగమించిరి. అనంత కొమ్మరాజాది భూమీశులును దమ పాత్రములు త్యజించి బాలుని వచనంబు లనుసరణీయంబులని ప్రశంసించుచు నాయసింగని వీరతాంబూలము పెట్టుమని యర్థించిరి. నాయఁ డందులకు దరహాసము నెఱపి పుట్టపై వీరతాంబూలముఁ బెట్టి దానిఁ గైకొనువాఁడే ప్రథమ రణంబునకు నాయకుఁడగుట కర్హుఁడని వచియించెను. వీర నాయకులెల్లరు నా తాంబూలముఁ గైకొన యత్నించిరిగాని వల్మీకాంతరంబునఁగల సర్పఫూత్కారములకు చకితులై వెనుకంజ వేయసాగిరి. కాని బాలుఁ డావంతయేని భయమందక వల్మీకముపై సువర్ణపాత్రయందుఁగల తాంబూలము నవలీలగా గొనితెచ్చి ధానిఁ దండ్రి పాదంబులకడ నుంచెను. నిజసూనుని ధైర్యసాహసంబులకు మనంబున నుబ్బి, యట్టి శూరాగ్రేసరునకుఁ దండ్రి యగు భాగ్యము తన కబ్బినందులకు నాయఁడు లోలోన సంతసించి కుమారుం గని “కుమారా! నలగామునకు బాసటయై వచ్చిన విరోధి వరూధినీ జాలేంధనంబుల నీ శౌర్యాగ్నిచే దహించు’మని చెప్పి దీవించి పంపిన నతఁడు సుహృజ్జనంబులఁగూడి యుద్ధరంగముఁ జొచ్చెను.

అత్తఱి బ్రహ్మనాయఁడు బాలమద్దేవులు పిన్నవయస్కులగుట యుద్ధసంక్షోభమునకు భయంపడుదురని యూహించి

వారికిఁ గన్నమసీని తోడుగానిచ్చి రాజవరంబను పురంబున కనిచెను. వారచట నొక దివ్యహర్మ్యంబున వసియించిరి.

సంధికార్య మట్లు విఫలం బగుట గాంచి నలగాముని చమూపతులు సందుల గొందుల దాగుచుఁ బాఱిపోయి తమ తమ బలంబుల నాయత్తము గావించుకొని యుద్ధ భూమికి రాఁదొడఁగిరి. నలసింగ ధరావరుఁడు గజారోహుం డయి నలగాముని పక్షమున సైన్యాధిపత్యము వహించి సమిత్రుండగు బాలుని పైకిఁ దన సైన్యములఁ బురికొల్పెను. అంత నుభయ వాహినులకును దుముల సంగర మారంభ మయ్యెను. బాలచంద్రుఁడు నలసింగభూధవుని శిర ముత్తరించెదనని ప్రతినవట్టి సంగడీలతోఁ బోరునకుఁ దలపడెను. ఆ శూరాగ్రేసరులు చిచ్చఱపిడుగుల చందమున శత్రుసైన్య పంక్తులఁ జొచ్చి కరవాలంబుల ఖండించుచుఁ గుంతంబులఁ గ్రుమ్మిచు ముద్గరంబుల మోదుచు గదాయుధంబులఁ బొడి యొనర్చుచు చతురంగబలంబులఁ జెండు చెండాడి మన్మథాం శము లట్లు వీరవిహార మొనరింపఁ జొచ్చిరి. బాలుర ధాటి కోర్వఁజాలక రిపుసేనలు చెల్లపాలై గల్లపాలై పరుగిడ సాగెను. అదిచూచి నలసింగభూధవుఁడు దండనాయకులఁకుఁ జేసన్న సేయ వా రొక్కుమ్మడి తిరిగి శాత్రవుల నెదుర్కొన సాగిరి. తండోపతండంబులుగాఁ దన కెదురువచ్చు వరూథినీ నివహంబులఁ దిలకించి బాలచంద్రుఁడు హరిణ యూథంబుల పైకి నుఱుకు బెబ్బులి చందమున వారిఁ దార్కొనెను. వా రాతని శౌర్యాగ్నికిఁ దాళలేక మరలఁ బలాయన

మంత్రము పఠింపసాగిరి. పరువులువారు సేనానాయకులఁ గాంచి నలసింగక్ష్మాధిపుఁడు తన దంతావళమును బాలుని పైకి డీకొలుప నతఁ డద్దాని కరంబు ఖండించెను. అట్లు తెగిపడిన వారణంబుపై నాసీనుఁడై యున్న భూధవుం గాంచి బాలచంద్రుఁ "డోరీ నృపాధమా! ఇఁక నీవెచటికిఁ బోయెదవు. నీతో రణంబుసేయ సమకట్టితి. ఏనుగు నుండి దిగి రమ్మ"ని కృపాణము ఝుళిపించుచు గర్జించెను. ఆ కఠినోక్తులకు గుండియ రాయిపడి యెటుదోఁపక రేఁగులు దంగేళ్లుగాఁ ద్రొక్కుచుఁ బాఱిపోవ సాగెను. బాలచంద్రుఁ డాతని వెంబడించెనుగాని యతఁడు తప్పించుకొని సైన్యముల మధ్య మాయమయ్యెను. అప్పుడు బాలుఁడు పరుగెత్తుచున్న మఱి యొక సామంతరాజును జూచి యతఁడే నలసింగరా జనుకొని యాతని యుత్తమాంగముఁ దునిమి యద్దానిఁ గొని వచ్చి తన జనకుని పాదముల కడఁబెట్టెను. బ్రహ్మనాయఁ డద్దానిఁ జూచి యయ్యది నలసింగుని మస్తకము కాదనియు, నతఁడు నూతన సైన్యములఁ గొనివచ్చుటకు గురిజాల కేగెననియు దెలిపిన బాలచంద్రుఁడు లజ్జావనతవదనుండై క్రోధ మగ్గలింప మరల రణరంగమున కరిగెను.

ఇంతలో నలసింగ ధరాధిపుఁడు నూత్న సైన్య సమేతుండై వచ్చి యాహవరంగమునఁ జేరెను. బాలచంద్రుఁ డాతనిఁ గాంచి వంతనె పగగొన్న పన్నగము చాడ్పున రోషకషాయిత నేత్రుండై యతనిఁ దాఁకి సైన్యతతుల కర వాలంబునఁ జెండుచు మువ్వుల భీముఁడు మొదలుగాఁ గల

సైన్యాధిపతుల శిరంబు లట్టకుఁ బాపెను. తన వాహినీ పతు లట్లొక పెట్టున నీల్గిన నలసింగరాజు బాలునితో నెక్కటి కయ్యంబునకుఁ గడంగెను. ఆ క్రందు కయ్యంబున బాల చంద్రుఁడుక్కుమిగిలి యాతని శిరంబు ఖండించి యద్దానిఁ గొని చని తన జనకునికిఁ జూపెను. ఆత్మజుఁ డొనర్చిన కార్య మునకు బ్రహ్మనాయఁ డతని నభినందించెను. కొమ్మరాజాదు లును నలసింగ నృపుని మరణంబునకు వగచిరి.

నిజజనకుండు పలికిన నిందా వాక్యంబులకు బాలఁ చంద్రుఁడు మిగుల నలిగి మరల రణస్థలిఁ జొచ్చి యరివీరుల గుండియలు వ్రీల్చి భుజంగ వాహినీ తీరంబునకరిగి యచటఁ దన వాలు కరవాలంబు నాటి యద్దానిపై మొరిగి వనంబుల నేర్చు దవానలంబు తనంతఁదా నడగువ ట్లసువులుబాసి వీర స్వర్గంబున కేగెను. బాలచంద్రుని నెచ్చెలులును రణస్థలిఁ దమ యకుంఠిత వీర్యముఁ జూపి శత్రుభూపతుల ననేకుల వీర స్వర్గంబునకుఁబంపి వారి సైన్యములఁ జెల్లాచెదరు గావించిరి. రణరంగమునఁ దమ మిత్రుఁడు కనఁబడక పోవుటచే వా రాతని వెదకుకొనుచుఁ బోయి నదీతీరంబున గతాసుఁడై పడి యున్న బాలచంద్రునిఁ గాంచి దురపిల్లుచుఁ దమ కైదు వులపై నొరగి తమ చలికానిఁ జేరఁబోయిరి.

బాలచంద్రుఁడును నతని చెలికాండ్రును నాగులేటి దరి స్వేచ్ఛామరణము నొందిరని విని నాయకురాలుప్పొంగెను. నలసింగరాజు మరణించుటచే నాయకురాలే సేనాధిపత్యము వహించి పురుషవేషధారిణియై యశ్వారోహణ మొనర్చి

చతురంగ బలంబులతో రణభూమి కేతెంచెను. నాయకురాలు దురమొనర్ప వచ్చె నని విని బ్రహ్మనాయఁడు నిజాగ్రజుం డగు పెద్దనాయనిఁ గొమ్మభూవిభుని శత్రువుల మార్కొన నియమించి పంపెను.

పెద్దనాయఁడు శాత్రవ సైన్యంబులఁ జూచి గర్జించుచు రౌద్రమూర్తియై వాని నెదిర్చి గజవాజిశతాంగంబుల నుగ్గు సేసెను. తొమ్మిది వందల మంది పదాతుల నొక్కపెట్టునఁ దాఁకి మునుము బట్టి యరటివనంబుఁ దఱుగు కరణి వారి యంగంబులు గడికండలుగాఁ దఱిగెను. శత్రువీరుల శిరంబులు పండి రాలు తాటిపండవలె నేలఁబడి దొరలుచుండెను. రిపు లట్లు పెద్దనాయని పరాక్రమమున కోర్వఁజాలక కాందిశీకు లగుచుండ నాయకురాలు పెక్కండ్రు ధనుర్ధరుల నాతనిపై కంపెను. వా రాతనిపై శరవర్షము కురిపించుచున్నను బెదరక నిదాఘ మధ్యందిన మార్తాండుని క్రియ దుర్నిరీక్ష్య తేజోవిరాజియై భీమపరాక్రమంబు నెఱపుచు నరివీరుల సమయించుచుఁ దుదకు వొప్పిచెర్ల వీరబహుళ్ళలోని జాస్తిపై నొరగి చెన్నుని పదంబులు చేరఁ బోయెను. రణకోవిదుం డగు కొమ్మవసుధాధిపుఁడును రిపు సైనికులఁ బెక్కండ్రఁ జక్కాడి వీరస్వర్గంబున కేగెను.

బాలచంద్రుండును, నతని చెలికాండ్రును, పెద్దనాయఁడును, గొమ్మభూకాంతుఁడును నిధనంబునొందిన వార్త విని బాలమల్దేవులు బిట్టువగచి హఠయోగంబునఁ బ్రాణవాయువులు వదలిరి. ఆ రాజనందనుఁ డట్లసువులు దొఱఁగిన నంత

దనుక వారిని సంరక్షించుచుండిన కన్నమదా సనుజసహితుండై వచ్చి యీ దుఃఖవార్త బ్రహ్మనాయని చెవిఁ బడవైచి మిగుల వగలఁ బొగలఁజొచ్చెను. బ్రహ్మనాయఁ డతని నోదార్చి నాయకురాలి గజబలంబులపై కంపెను. అతనితో గూడ నాతని తమ్ములును, నలువదార్గురు పోటుమన్నీలును, పేర్నీఁడును. నతని యనుజన్ములును, గండుకన్నమ సుంకర దామానాయఁడు మున్నగు నాప్తజనంబులును రణభూమి కరిగిరి. నాయకురాలు తన బలంబులను నాలుగు భాగములు గావించెను, అందుఁ దూర్పున నున్న సైన్యముల పైకిఁ బేర్నీఁడును నాతని యనుజులును, దక్షిణమున నున్న మూఁకల పైకి సుంకర దామానాయఁడును, పశ్చిమసైన్యముల పైకి గండు కన్నమనీఁడును, నుత్తరబలంబుల పైకిఁ గన్నమదాసును నతని సోదరులును బోయిరి.

వీరనాయకు లట్లు కదళీవనంబుఁ జొచ్చు కరీంద్రముల భంగి శత్రుసైన్యములపై నుపక్రమించి శతాంగంబుల శకలంబులు గావించుచుఁ, దత్తడుల మొత్తుచు, కరుల ఖండించుచు, వీరుల శిరంబుల గల్చుచు వీరవిహారంబులు సల్పిరి. రిపుసేనా నివహంబు లట్లు చాపచుట్టుగ మడియుటం జేసి పేర్నీఁ డనుజసహితంబుగ సన్నిగండ్ల సమీపమున మేను వాసి సురవాసంబున కేగెను. సుంకర దామానాయుండును గండు కన్నమనీఁడును గదనభూమినిఁ బీనుంగుబెంటఁ జేగప్పి దివ్యలోకంబునకుఁ బోయిరి.

కన్నమనీఁడు తన పన్నెండు మూరల భైరవఖడ్గంబుఁ గొని నాయకురాలు గొనివచ్చిన నిషాదుల వండఁ దఱిగిన యట్లు తఱిగి మాతంగ మస్తకంబులు వ్రక్కలించెను. అతని తమ్ములును బీరంబు సూపి రథికుల భిన్నాంగులఁ గావించి చింతపల్లి బయళ్ళలో నొరగిరి. తమ్ము లట్లు నిదనమొందుటఁ జూచి కన్నమదాసు మహోగ్రుండై శత్రువులపైఁ బడి చిందఱవందఱ చేసెను. తన సైన్యము లన్నియు నట్లు సమయఁగా నాయకురా లశ్వము నెక్కి పాఱిపోవుచుండ కన్నమదాసా వీరవనితను వెంటాడి హయపాదంబులు ఖండించిన నాపె క్రిందఁ బడ కరంబులు రజ్జువున బిగించి కట్టి తెచ్చి బ్రహ్మనాయని పదపద్మముల మ్రోలఁ బడవేసెను. నాయకురాలు వినయ వినమితగాత్రి యై తన్ను క్షమింపు మని నాయని పదరాజీవములకు మ్రొక్కిన నతఁ డుదారస్వభావుం డగుట నా మృగాక్షిని క్షమించి విడిచిపెట్టెను.

బ్రహ్మనాయఁడు బంధుజన క్షయంబునకు మిగులఁ బరితాపమొంది మేడపియం దున్న కాంతాజనంబులఁ గొనిరాఁ గన్నమనీనిఁ బుత్తెంచిన నతఁ డచిరకాలముననే వారలఁ దోడ్కొని వచ్చెను. అనంతర మాతఁడు దురమున మరణించిన బాంధవాళికిని వీరనాయకులకును నగ్నిసంస్కారములు సల్పి వారి పేర నాగులేటితీరమున లింగములు నిల్పి, గంగధార యను హ్రదంబు పొంత నొక్క దేవాలయంబు నిర్మించి యచట వీరాచారములు నడుపుటకుఁ బిడుగుమంత్రమూర్తి యను నొక భూసురుని నియమించెను. నలగామ

రాజును క్షమియించి మరల నతనినే రాజ్యమున నిలిపెను. ఇట్లు రాజ్యవ్యవస్థ నెలకొల్పి, వైరాగ్య మూని హతశేష బంధువర్గములతో గుత్తికొండబిలము సొచ్చెను. నాయకురాలును జీవితముపై విరక్తి నంది సర్వ సంపదలు త్యజించి నాయుని దాసకోటిలోఁ జేరి తపం బాచరింప నా బిలమార్గంబునఁ బోయెను.

